

# శ్రీకాళహస్తీశ్వర శతకము.

తాత్పర్య సహితము.

ధూర్జటికవి కృతము.



రాజమండ్రి బుక్కుసెల్లర్సు

కర్రా అచ్చియ్య అండు సన్సు

ప్రకటింపబడిరి.

1924

రాజమండ్రి

క్రౌణ్ ప్రెస్‌యందు ముద్రింపఁబడియె.

 [వెల 5 అణాలు.





# పీఠిక.

## హస్తీశ్వర శతకము

స్తీశ్వర శతకమను పేరునకు కారణము.

కాళ × హస్తి × ఈశ్వర × శతకము

శ్రీ. కాళంబు లేక కాళము అనగా (అట్టిపేరుగల) పాము. నుగు. ఈశ్వరుడు అనగా శివుడు. శతక అనగా నూరుగా చేయబడినది అన నూరుపద్యములుగలది. గావున పామువల్లను, యేనుగువల్లను, పూజింపబడిన శివునిగూర్చి చెప్పబడిన నూరుపద్యముల పుస్తకమనియర్థము.

కాళహస్తి:—ఇదిదక్షిణదేశమందున్న యొకగొప్ప పుణ్యక్షేత్రము పూర్వమిది వసిష్ఠమహాముని యాశ్రమమట, పామునేనుగు మొదలగునవి యిచ్చోటముక్తి జెందుటచే యా క్షేత్రమునకు శ్రీకాళహస్తి యను నామము గలిగెను.

## —.ధూర్జటి కవి.—

ఈశతకము ధూర్జటికవిచే వ్రాయబడినది. ఈతడొక నియోగిబ్రాహ్మణుడు. కాళహస్తిపురాధీశ్వరుని సంస్థానమున మొదటకవిగానుండి తరువాతగొన్నినాళ్ళకు కృష్ణదేవరాయల యాస్థానమందు యష్టదిగ్గజములని పేరొందినవారలలో నొకడు. 16 వ. శతాబ్దములోనివాడు. ఈతనికవిత్వము బహుగూఢముగనుండును. గ్రామ్యపదములుగూడ నచ్చటచ్చటవాడెను.

ధూర్జటిమిగుల గొప్ప శివభక్తుడగుటచే కృష్ణరాయల యాస్థానమందున్నను తానువ్రాసిన యీశతకమును రాజులకంకితమియ్యక శ్రీ కాళహస్తీశ్వరునికేయంకితమొనర్చెను. ఈతడు వ్రాసిన పద్యములలో జాలవరకు రాజులగూర్చి గూడ జెప్పబడియున్నవి. ఆపద్యములను బట్టిచూడ యాపుడమిపాలురతని బహుకష్టముల బెట్టినట్లును తనదగ్గర బంధువులుగూడ తనకు విరోధులైనట్లును స్పష్టమగుచున్నది.




# శ్రీ కాళహస్తీశ్వరశతకము.

శా. శ్రీవిద్యుత్కలితాజవంజవమహాజీమూతపాపాంబుధా
రావేగంబున మన్మనోబ్జసముదీర్ణత్వంబుఁ గోల్పోయితిన్
దేవా మీకరుణాశరత్సమయ మింతేఁ జాలుఁ జిద్భావనా
సేవం దామరతంపరై మనియెదన్ శ్రీకాళహస్తీశ్వరా. 1

తా. కాళహస్తీశ్వరా! ఐశ్వర్యమనెడు మెఱుపుతీగతోఁ గూడినట్టి సంసారమనెడు పెద్దమబ్బునుండి పడిన పాపములనెడి వర్షధారలచే నామనస్సనెడు పద్మముచెడియున్నది. కనుక శ్రీకాళహస్తీశ్వరా! నీదయ యనెడు శరత్కాలమునుదయింపజేసి నామనఃపద్మమును వికాసవంతముగాచేసి రక్షింపుము.

శా. వాణీవల్లభదుర్లభం బగుభవద్ద్వారంబున న్నిల్చి ని
ర్వాణశ్రీఁ జెఱపట్టఁ జూచిన విచారద్రోహమో నిత్యక
ళ్యాణక్రీడలఁ బాసి దుర్దశలపాలై రాజలోకాధమ
శ్రేణీద్వారము దూఱఁజేసె దెపుడో శ్రీ... 2

తా. శ్రీకాళహస్తీశ్వరా, స్వామీ, బ్రహ్మాదులకు అసాధ్యమై ఒప్పుచున్న ముక్తికాంతను అనర్హుడనైన నేను పొందుటకు ప్రయత్నించినందులకు శిక్షగా దుష్టులయిన యీరాజులయొక్క ద్వారములవద్ద పడియుండ నియమించితివిగాబోలును.

శా. అంతామిథ్య తలంచిచూచిననరుం డట్లౌటెఱింగినన్ సదా
కాంతల్పుత్రులు నర్థమున్ తనువు నిక్కంబంచు మోహార్ణవ
భ్రాంతిం జెందిచరించుఁగాని పరమార్థంబైన నీయందుఁదాఁ
జింతాకంతయుఁ జింత నిల్పఁడుగదా శ్రీ... 3

తా. శ్రీకాళహస్తీశ్వరా, విచారించిచూడగా దారాపుత్రాదులు అశాశ్వతములు. ఇట్టియంశమును గుర్తెరిగియు మూఢులగువారు నిన్ను మరచి సంసారవ్యామోహమందు మునిగియుందురు. లేశమైనా నీపాదసేవయందు బుద్ధినిల్పరు.

శా. నీనా సందొడఁబాటుమాట వినుమా నీచేత జీతంబు నేఁ
గానిం బట్టక సంతతంబు మది వేడ్కన్ గొల్తు నంతెస్సప
త్నానీకంబున కొప్పగింపకుము నన్నాపాటియేచాలుఁ దే
జీనొల్లం గరినొల్ల నొల్లసిరులన్ శ్రీ... 4

తా. కాళహస్తీశ్వరా! నీకును నాకును ఒకరాజీనామామాటకలదు. ఏదియనిన నీవేమియు నాకు జీతభత్యములుయివ్వకయె నీ సేవనేజేయుటయు కామక్రోధాదులను మహాశత్రువులకు వశముగానీయక నన్ను నీవు గాపాడుటయు. ఇదియే నాప్రార్థన.

మ. భవకేళీమదిరామదంబున మహాపాపాత్ముఁడై వీఁడు న
న్ను వివేకింపఁ డటంచు నేను నరకార్ణోరాశిపాలైనఁ బ
ట్టువుబాలుండొకచోటనాటతమితోడన్నూతఁగూలంగఁ దం
డ్రి విచారింపక యుండునా కటకటా శ్రీ... 5

తా. స్వామీ! నీభక్తుడనైననేను నరకమను సముద్రములోపడి పోవుటచూచి ఉపేక్షసేయుట చూడగా నూతిలోబడిపోవుచున్న కుమారునికి

చేయూతయిచ్చి కన్నతండ్రి రక్షించని విధముగానున్నది. ఇది న్యాయము కాదు. నన్ను రక్షింపుము.

శా. స్వామిద్రోహముఁజేసి యే నొకనిఁ గొల్వంబోతినో కాక నే
నీమాట న్విన నొల్లకుండితినొ నిన్నే దిక్కుగాఁ జూడనో
యేమీ యిట్టివృథాపరాధి నగున న్నీదుఃఖవారాశివీ
చీమధ్యంబున ముంచి యుంచఁదగునా శ్రీ... 6

తా. శ్రీకాళహస్తీశ్వరా! సర్వమునకు ప్రభుడైనతండ్రీ! ఏవిషయమందును నీకువ్యతిరిక్తుడను గాను. నిన్నేకొల్చుచుంటిని. యితరదైవములను నమ్మియుండలేదు. నావంటి నిర్దోషిని యిటువంటి దుఃఖసముద్రమున ముంచుట న్యాయమా?

మ. దివిజక్ష్మారుహధేనురత్నఘనభూతిప్రస్ఫురద్రత్నసా
నువు నీవిల్లు నిధీశ్వరుండు సఖుఁ డర్ణోరాశికన్యావిభుం
డు విశేషార్చకుఁ డింక నీ కెన ఘనుండుం గల్గునే నీవు చూ
చి విచారింపవు లేమి నెవ్వఁ డుడుపున్ శ్రీ... 7

తా. శ్రీకాళహస్తీశ్వరా! కల్పవృక్షము, కామధేనువు, మేరువపర్వతము, మున్నగు మహాభాగ్యములన్నియు నీయధీనమందేయున్నవి. హరి బ్రహ్మాదిదేవతలెల్లరు నిన్నేకొల్చుచుండిరి. ఎక్కడజూచినను నిన్నుమించిన ప్రభువులేడయ్యెను. నిన్నుకాదని ఎవ్వరినాశ్రయించినా ప్రయోజనములేదు.

శా. నీతో యుద్ధముఁ జేయ నోపఁ గవితానిర్మాణశక్తి న్నినుం
బ్రీతుం జేయఁగ లేను నీకొఱకుఁ దండ్రిం జంపఁగాఁజాల నా
చేత న్రోఁకట నిన్ను మొత్త వెఱతుం జీకాకు నాభక్తి యే
రీతి న్నాకిఁక నిన్నుఁ జూడఁగలుగున్ శ్రీ... 8

తా. శ్రీకాళహస్తీశ్వరా, తొల్లిటిమహాభక్తులగు అర్జునునివలెనీతో యుద్ధముజేయలేను. మహాకవియగు పుష్పదంతుడను గంధర్వునివలె కవిత్వము చెప్పినిన్ను మెప్పింపజాలను. మిగుల నారూఢభక్తులగు మరికొందరు ప్రాచీనభక్తులవలె తండ్రిని జంపుట కుమారునికోసియిచ్చుట మొదలయినసాహసములను జూపజాలను. నాభక్తి కొలదియని యోచింపక నన్నురక్షించుటయే నాప్రార్థన.

పురాణగాధ:—అర్జునుడు శివునిగూర్చి ఘోరతపస్సుచేసి పందరూపముతోవచ్చిన శంకరునితో యుద్ధముజేసెను. పుష్పదంతు డనుగంధర్వుడొకడు శివునిపూజించి తనపోయినశక్తిని మఱలగాంచెను.

శా. ఆలుంబిడ్డలుఁ దల్లిదండ్రులు ధనం బంచు న్మహాబంధనం
బేలా నామెడఁ గట్టినాఁడ విఁక ని న్నే వేళఁ జింతింతు ని
ర్మూలంబైనమనంబులోఁ గుదురునో మోహాబ్ధిలోఁ గ్రుంకియీ
సీలామాలపుఁజింత నెట్లుడిపెదో శ్రీ... 9

తా. శ్రీకాళహస్తీశ్వరా! దారాపుత్రులనియు తల్లిదండ్రులనియు, ధనములనియు మొదలైన మోహావేశకరము లయిన పాశములను నామెడకు జుట్టబెట్టితివి ఇట్టిబంధములయందు నామనస్సెట్లు నీయందునిలుచును ? కావున వైరాగ్యభాగ్యము దయచేసి నీసేవకుడనుగా గాంచి నాకు నిర్మలానందమును దయచేయుము.

శా. నిప్పైపాతకతూలశైల మడఁచు న్నీనామము న్మానవుల్
తప్పన్ దవ్వుల విన్న నంతకభుజాదర్పోద్ధతక్లేశముల్
తప్పుం దారను ముక్తులౌదురని శాస్త్రంబుల్మహాపండితుల్
చెప్పంగాఁ దమ కింక శంక వలెనా శ్రీ... 10

తా. శ్రీకాళహస్తీశ్వరా! మహాపండితులును సమస్తశాస్త్రములును పావనమైన నీనామమును కొండలవలెబడియున్న మహాపాతకమును స్మరణమాత్రముచేత నశింపజేయుననియు శ్రవణమాత్రముచేతను యమబాధలు తప్పించి ముక్తినొసగునని బోధించుచుండగా సంశయముతో బనియేమి? పామరులు దీనిభావమును కనుగొనలేరని తాత్పర్యము.

శా. వీడెం బబ్బినయప్పుడుం దమనుతుల్ విన్నప్పుడుం బొట్టలోఁ
గూడున్నప్పుడు శ్రీవిలాసములు పైకొన్నప్పుడుం గాయకుల్
పాడంగా వినునప్పుడుం జెలఁగు దంభప్రాయవిశ్రాణన
క్రీడాసక్తుల నేమిచెప్పవలెనో శ్రీ... 11

తా. శ్రీకాళహస్తీశ్వరా! ఇహలోకవిషయవాసనలతో లెస్సగా తులదూగుచున్న సమయములందు అనగా భాగ్యభోగ్యాదులువడసి పరమార్థచింతలేశమైనను లేని మనోన్మత్తులకు నీసేవపట్టుపడునా? పట్టువడదని భావము.

మ. నిను సేవింపఁగ నాపద ల్పొడమనీ నిత్యోత్సవం బబ్బనీ
జనమాత్రుం డననీ మహాత్ముఁ డననీ సంసారమోహంబు పైఁ
కొననీ జ్ఞానము గల్గనీ గ్రహగతుల్ కుందింపనీ మేలువ
చ్చిన రానీ యవి నాకు భూషణములో శ్రీ... 12

తా. శ్రీకాళహస్తీశ్వరా! పవిత్రమైన నీపాదధ్యానము నాకలవడియుండినవేళయందు లోకులు నిందించినను భూషించినను సంసారబాధలు ముట్టడివేసినను దుష్టమైనగ్రహములు పీడించినను వానినన్నిటిని భూషణములుగభావింతునుగాని లెక్కసేయను.

శా. ఏవేదంబుఁ బఠించె లూత భుజగంబేశాస్త్రములుఁ జూచెఁదా
నేవిద్యాభ్యసనంబొనర్చెఁగరి చెం చేమంత్రమూహించెబో
ధావిర్భావనిదానముల్ చదువు లయ్యా! కావు! మీపాదసం
సేవాసక్తియె కాక జంతుతతికిఁ శ్రీ... 13

తా. ఓశంకరా! నీపదభక్తి వడయలేని వేదాధ్యయనసంపన్నుఁడైనను, మహామంత్రవేత్తయైనను, యెంతనేర్పరియైనను, నిర్మలమైనభక్తితో నిన్ను పూజించి గజారణ్యమునందు ముక్తిగాంచిన సాలెపురుగు సర్పము చెంచువాడు మున్నగు మహాభక్తులకు సాటికానేరడు.

పురాణగాధ:— పూర్వము సాలెపురుగు, సర్పము, చెంచువాడు ఏనుగు, కాళహస్తీశ్వరుడను లింగమునారాధించి ముక్తిని పొందెననియు శ్రీ అనగా సాలెపురుగు, కాళ అనగా సర్పము, హస్తి అనగా యేనుగనియు నర్థములుగాన నాలింగమునకు శ్రీకాళహస్తీశ్వరుడనుపేరు వాడుకలోనున్నది (కాం. సూ. ప్ర.)

శా. కాయల్గాచె వధూనఖాగ్రములచేఁ గాయంబువక్షోజముల్
రాయ న్రాపడె ఱొమ్ము మన్మథవిహారక్లేశవిభ్రాంతిచేఁ
బ్రాయం బాయెను బట్టఁగట్టెఁదల చెప్పన్రోఁతసంసారమేఁ
జేయంజాల విరక్తుఁ జేయఁగదవే శ్రీ... 14

తా. ఓసాంబమూర్తీ! వివేకచింతలేశమునులేక కేవలము మహామోహమను నంధకారములో మునిగి చిరకాలమునుండి మనస్సు పాపకృత్యములను ఆచరించి యిప్పుడువానియందు విముఖత్వముగలిగి సంసారమనిన రోతబుట్టుచున్నది. ఇకనైనను సుజ్ఞానమునిడి రక్షింపుము.

శా. నిన్నేరూపముగా భజింతుమదిలో నీరూపు మోఁకాలొ స్త్రీ
చన్నో కుంచమొ మేఁకపెంటికయొ యీసందేహముల్మాన్పి నా,
కన్నారన్భవదీయమూర్తిసగుణాకారంబుగాఁ జూపవే
చిన్నీరేజవిహారమత్తమధుపా శ్రీ... 15

తా. ఉమాపతీ! తండ్రీ! నీరూపమెయ్యదిగా భావించి సేవింపగలుగుదును. ఒకభక్తుడు మోకాలిని మఱియొకడు కుంచమును నిన్నుగా; భావించి పూజించి మోక్షమును పొందినట్లు ప్రసిద్ధిగలదు. అట్టిదృఢభావమునను బోలు కించిజ్ఞులకు చిక్కుట దుస్తరము. కన్నులకఱవుదీర నీనిజస్వరూపమును జూపినన్ను కృతార్థునిగావించి రక్షింపుము.

పురా:— కృష్ణుడొకనాడర్జును నికొక మాటసందర్భమున శివుడిచట లేడాయని తనమోకాలిని జూపగా శంకరుడు ప్రత్యక్షమాయెను. ఒకగ్రుడ్డివాడొక శివాలయములోని లింగమును దడవి పూజించుచుండ కొందరు కుంచము నొకదానిని జూపి యదియేలింగమనిరి. దానినేయతడుపూజించ నచట కుంచమునకు బదులు శివలింగముండెను.

మ. నిను నావాఁకిలి గాపు మంటినొ మరున్నీలాలకభ్రాంతిఁ గుం
టెన పొమ్మంటినొ యెంగిలిచ్చి తిను తింటేఁగాని కాదంటినో
నిను నెట్టుం దగ విశ్వసించు సుజనానీకంబు రక్షింపఁజే
సిననావిన్నప మేల కైకొనవయా శ్రీ...: 16

తా. త్రిపురారీ! పరమపావనుడవైన నీమహిమలు తెలియుట దుస్తరము. ఆహాయేమిసామర్థ్యము. బాణాసురుడను భక్తుడు తనవాకిట నిన్ను కాచియుండమని నియమించెను. మను అనుభక్తుడు తనకు దూతగాజేసికొనెను. తిన్నడను బోయవాడు నిన్నుతనయెంగిలిమాంసము తినిపించెను. దీనిని

బట్టి భక్తవశీకరుడవని తేటబడుచున్నది. నినుబోలు దయామయుండెం దైన గలడా? నన్నును నిస్సంశయముగ మనిచెదవని విశ్వసించుచున్నాను.

పు రా:— బాణాసురుడనువాడు శివుని తనగుమ్మంవద్దకాచి యుండు మనికోరెను. మను అనువాడు దేవతాస్త్రీలకు దూతగాబొమ్మనెను.

శా. రాలన్ రువ్వఁగఁ జేతులాడవు కుమారా రమ్మురమ్మంచు నేఁ
జాలన్ జంపఁగ నేత్రము ల్దివియఁగా శక్తుండ నేఁగాను నా
శీలం బేమని చెప్పనున్న దిఁక నీచిత్తంబు నాభాగ్య మో
శ్రీలక్ష్మీపతిసేవితాంఘ్రియుగళా శ్రీ... 17

తా. గౌరీపతీ! రాళ్ళను రువ్వినిన్ను మెప్పించుట నావశముగాదు. పసిబిడ్డను చేరబిలిచి చంపినీకు సమర్పించుట నాకుదుస్తరము. నేత్రముతీసి నిన్ను పూజించుట నాకుసాధ్యముకాదు. ఇటువంటిమహాభక్తి దురంధరులకు శిరియాళుడు విష్ణుమూర్తి మొదలయిన మహానుభావులకే చెల్లును. నాశీలమే మనియందువా, నీయొక్క కటాక్షమే నాభాగ్యమనిదృఢముగా నమ్మియుం డుటయే. కావున నాలోపములనెన్నక కాపాడుము.

పురాణగాధ;— ఒకబోయవాడు మార్గస్థులగొట్టి జీవించుచుండెను. గాని కాళహస్తీశ్వరుని పూజశేయక భోజనముచేసెడువాడుకాడు. ఒకరోజున వానికి పుష్పములుదొరలేదు గావున రాళ్ళేపుష్పములని తలంచి యారోజున బూజింపగా శంకరుడు ప్రత్యక్షమయ్యెను.

గొప్పశివభక్తుడగు శ్రీయాళుడను రాజుయొక్క భక్తిని బరిశీలించుటకై పార్వతీపరమేశ్వరు లిరువురు మాయవేషంబున యతిభిక్షులైవచ్చి భుజించుటకు ముందుగానే మనుష్యమాంసముతో భోజనముకావలెనని యడిగిరి వారం దులకంగీకరించి చిరుతొండడు అనుతమకుగలయొక్క పుత్రుని నరికిచంపివాని

మాంసము వారికి వండిపెట్టిరి. శివుడువారి యద్వితీయభక్తికి మెచ్చి చిరుతొండను బ్రతికించెను.

శా. రాజు ల్మత్తులు వారిసేవ నరకప్రాయంబు వారిచ్చు సం
భోజాక్షీచతురంతయానతురగీభూషాదు లాత్మవ్యథా
బీజంబుల్ తదపేక్ష చాలుఁ బరితృప్తిం బొందితిన్ జ్ఞానల
క్ష్మీజాగ్రత్పరిణామ మిమ్ము దయతో శ్రీ... 18

తా. మహేశ్వరా! రాజులు భాగ్యగర్వముచే యుక్తాయుక్త విచక్షణలేక యుందురు. వారిని సేవించుట కేవలము నరకప్రాప్తికే. వారుయిచ్చెడు గజతురగ భూషణాదులన్నియు మనస్సునకు విషాదమును కల్పించునవిగాని శాశ్వతానందమును జన్మరాహిత్యమును గలుగజేయలేవు. వానికొకనమస్కారము. అట్టినీచసేవల సంఘటింపక నీపాదారవిందమునందు దృష్టినిలిపి ధన్యునిజేయుము.

శా. నీరూపంబు దలంపఁగాఁ దుద మొదల్ నేఁ గాన నీవైనచో
రారమ్మనియంచుఁ జెప్పవు వృథారంభంబు లింకేటికిన్
నీరం ముంపుము పాలముంపు మికఁ నిన్నే నమ్మినాఁడం జుమీ
శ్రీరామార్చితపాదపద్మయుగళా శ్రీ... 19

తా. లోకేశా! శ్రీరాములవారిచేత పూజింపబడిన పాదకమలములుగల శివా! నీరూపమునకు నాదియు నంతమును నేను కనుగొనజాలను. నీవైనను యిదినిజరూపమని నాకు చూపవు. నాతో మాటలాడవు. వేయిమాటలేల? నీటిలో ముంచినను సరే. పాలలో ముంచినను సరే. నీవే నాకు దిక్కు అనియు నన్ను రక్షించుభారము కేవలము నీయందేయున్నదనియు నమ్మినాడను. నన్ను విడువవద్దని భావము.

శా. నీకు న్మాంసమువాంఛయేని కఱవా నీచేత లే డుండఁగ
జో కై నెట్టికుఠార ముండ ననలజ్యోతుండ నీ రుండఁగాఁ
బాకం బొప్ప ఘటించి చేతిపునుక న్భక్షింపఁ గాఁ బోయచేఁ
జేకొం టెంగిలిమాంస మిట్లు దగునా శ్రీ... 20

తా. శ్రీకంఠా! దృఢభక్తుడైన బోయవానివలె నెంగిలిమాంసము నీకు నివేదింపజాలను. ఆహా! భక్తిచేపరిపూర్ణమయిన యేపదార్థము నైనను నీవు స్వీకరించి భక్తుని మనోరథము చెల్లించుట నీకేచెల్లునుగాని మఱియెవ్వరి కగును? ఏలననగా నీకు మాంసముకావలెననిన నీహస్తమునందులేడి యుండ లేదా? వాడియైనగొడ్డలిలేదా! నొసటియందగ్నిలేదా? సులభముగాపాకము చేసికొనగలవు. అట్లుచేయక ఎంగిలి మాంసము గైకొనుట కేవలము భక్తుడైన బోయనియొక్క మనస్సును తృప్తిపరచుటకే చేసితివి. నేనునుభక్తుడను గాన నాయందు వాత్సల్యమునిల్పుము.

పురా—ఒకబోయవాడుగలఁడు. వానిపేరు తిన్నడు. వాడు ప్రతి దినమును జంతుమాంసమును కూరగావండుకొనుచు వది బాగుగానున్నదిలేనిది ముందుగ రుచిచూచి యది బాగుండిన కాళహస్తీశ్వరుని కర్పించుచుండెను. అకూర బాగుగాలేదని తనకు తోచినయెడల పారవేయుచుండెనట.

శా. రాజై దుష్కృతిఁ జెందెఁ జందురుఁడు రారాజై కుబేరుండు
దృగ్రాజీవంబునఁగాంచెదుఃఖము కురుక్ష్మాపాలుఁడామాటనే
యాజిం గూలెసమస్తబంధువులతో నారాజశబ్దంబు చీ
చీ జన్మాంతరమందు నొల్లనుజుమీ శ్రీ... 21.

తా. మురారిప్రియా! రాజశబ్దమువినినంతమాత్రమున నాకు కర్ణక ఠోరముగనుండును. స్వామీ! రాజశబ్దమును ధరించిన చంద్రుడు దోషియై

కళంకమును జెందె. రారాజు అను పేరుబొందిన కుబేరుడు మహాదుఃఖములను పడసెను. దుర్యోధనుడు ఆ రాజశబ్దమునుధరించి మదోన్మత్తుడై బంధువర్గములతో యుద్ధమునందు మడసెను. కనుక 'రాజశబ్దమే జన్మమందును నాకు ఘటింపకుము. (అనగా రాజులసంస్థానమునందు యీశతకమును జెప్పి ధూర్జటిమహాకవి పెనుబాములపెట్టబడి వారియొక్క దుస్స్వభావములగురించి తన యనుభవమును తెల్లముగావించెను.)

ప.రా:—యీపద్యములను కాళహస్తీశ్వరునిపై కవిత్వముగాజెప్పిన ధూర్జటి యప్పుడా దేశములలోనుండెడు భూమీశులవలనను, బంధువులవలనను, తదితరులవలనను పలుబాట్లు బెట్టబడి మిగులవిచారించి, సమస్తమందు నురోతజనింపగా కాళహస్తీశ్వరుని యాలయమునకు బోయి యిట్లు పద్యములువ్రాసెనట.

శా. రాజర్థాతురుడైనచో నెచట ధర్మంబుండు నేరీతి నా
నాజాతిక్రియ లేర్పడన్ సుఖము మాన్యశ్రేణి కెట్లబ్బు రూ
పాజీవాళికి నేది దిక్కు ధృతినీభక్తుల్ భవత్పాదనీ
రేజంబుల్ భజియింతు రేతెఱగునన్ శ్రీ... 22-

తా. శంకరా! రాజు కేవలము న్యాయవిసర్జనుడై ధనాకర్షణమే ముఖ్యముగా గైకొని దుష్కృత్యములు చేయనారంభించినచో వర్ణాశ్రమధర్మము లెట్లునడచును? సజ్జనులకు దిక్కెయ్యది? నీభక్తవరులు నిర్మల మనస్సుతో యెట్లు నిన్నుపూజింపగలరు? గావున దుర్మార్గులయిన రాజుల బాధలనుండి రక్షింపుము.

కవి యీపద్యములోగూడ పుడమీశు లన్యాయవంతులని వ్రాసెను.

మ. తఱఁగల్ పిప్పలపత్రముల్ మెఱుఁగుటద్దంబుల్ మరుద్దీపముల్
కరికర్ణాంతము లెండమావులతతుల్ ఖద్యోతకీటప్రభల్

సురవీథీలిఖితాక్షరంబు లసువుల్ జ్యోత్స్నాపయఃపిండముల్
సిరులం దేల మదాంధు లౌదురు జనుల్ శ్రీ... 23.

తా. గరళకంఠా! జగత్ప్రభూ! ప్రాణములు చూడగా నీటిబుగ్గల వంటివియు, మెరుగులు బెట్టిన అద్దములవంటివియు, గాలిలోని దీపపు మొగ్గల వంటివియు, యేనుగుచెవులవంటివియు, ఎండమావులవంటివియు, వెన్నెలపు రుగులవంటివియు, బయలులో వ్రాసిన అక్షరములవంటివియు నైయుండగా, నిముసమైననిలుకడలేని మాయధనములనుగూర్చి మురియుట కేవలము వెఱ్ఱితన ముగాదా? కనుక శాశ్వతమైన ఆనందమునుగూర్చు నీకటాక్షమును వివేకి యొన్నడును విడువడు.

శా. నిన్నున్ నమ్మినరీతి నమ్మ నొరులన్ నీకన్న నాకెన్న లే
రన్నల్దమ్ములు తల్లిదండ్రులు గురుం డాపత్సహాయుండు నా
యన్నా యెన్నఁడు నన్ను సంసృతివిషాదాంభోధిదాఁటించి
యచ్ఛిన్నానందసుఖాబ్ధిఁ దేల్చెదొకదే శ్రీ... 24

తా. లోకేశ్వరా! నిన్నునమ్మినవాడను. నీకంటె ఏవిషయమందును అధికుడులేడు. తల్లి దండ్రి గురువు సమస్తము నీవేకాని నాకువేరొండు శరణ్యములేదు. సంసారసంబద్ధమైన యుష్మవావేదననుండి శాశ్వతమోక్షానందమును నాకెప్పుడుగూర్తువోయని యువ్విళ్ళూరుచున్నవాడను.

శా. నీపంచం బడియుండఁగా గలిగిన న్భిక్షాన్నమే చాలు ని
క్షేపం బబ్బిన రాజకీటముల నే సేవింపఁగా నోప నా
శాపాశంబులఁ జుట్టితిప్పకుము సంసారార్థమై బంటుగాఁ
జేపట్టం దయగల్గెనేని మదిలో శ్రీ... 25.

శా. నీపేరుం భవదంఘ్రితీర్థము భవన్నిష్ఠ్యూతతాంబూలముల్
నీపళ్లెంబుప్రసాదముం గొనికదా నే బిడ్డనైనాఁడ న
న్నీపాటిం గరుణింపు మోప నిఁక నే నెవ్వారికిం బిడ్డగాఁ
జేపట్టం దగుఁ బట్టి మానఁదగ దో శ్రీ... 26.

తా. మహేశ్వరా! నీపాదతీర్థప్రసాదనియమంబుల దప్పక నిన్నా రాధించుటచే నీపుత్రుఁడనని చెప్పుకొనుటకు అర్హుడనైయున్నాడను. నీకటాక్షమునకు పాత్రుడను. నాయట్టివానిని విడుచుటభావ్యముకాదు. శరణంటిని కాన రక్షింపుము.

శా. అమ్మా యయ్య యటంచు నెవ్వరిని నే నన్నన్నివా నిన్నునే
సుమ్మీ నీమదిఁ దల్లిదండ్రు లటంచు న్జూడఁగాఁబోకు నా
కిమ్మైఁ దల్లియుఁ దండ్రియున్ గురుఁడు నీవే కాక సంసారపుం
జిమ్మంజీఁకటిఁగప్పినన్ గడపు నన్ శ్రీ... 27.

తా. పార్వతీపతి! మాయసంసారవ్యాపారమునందు వర్తించునపుడు అమ్మా, యయ్యా, యనియెవ్వరిని నేను పిలిచినను అందుప్రకాశించు మహద్వస్తువు నీవైయుండుట గుర్తెరిగి నీయందు భావమును నిల్పి పిలుచుచుంటిని గాని అన్యము గాదలంపకుము. తల్లియు దండ్రియు గురుడును సమస్తమును నీవె. అజ్ఞానమను నంధకారము నన్నొకవేళ చుట్టినను దానిని విదళించి నన్ను దరిజేర్చుము. (K. S. P.)

మ. కొడుకుల్ పుట్ట రటంచు నేడ్తు రవివేకు ల్జీవనభ్రాంతులై
కొడుకుల్ పుట్టరె కౌరవేంద్రున కనేకుల్ వారిచే నేగతుల్
వడసెం బుత్రులు లేని యా శుకునకున్ బాటిల్లనే దుర్గతుల్
చెడునే మోక్షపదం బపుత్రకునకున్ శ్రీ... 28.

తా. పావనమూర్తీ! అజ్ఞానులు కొందరు బిడ్డలుకలుగలేదని పామర వృత్తిచే మనోవ్యధను తెచ్చిపెట్టుకొందురు. ధార్తరాష్ట్రునకు పెక్కుమంది కుమారులుండియు నాపుత్రులచే తానేమియుద్ధరింపబడెను. అపుత్రుడైనశుక మహామునికి యేమి యాపదవాటిల్లెను? కనుకఅదివెఱ్ఱిభ్రాంతి. జ్ఞానపుత్రుడే పుత్రుడు. తన్ను భవసాగరమునుండి తేల్చు నజ్ఞానమే నిజమైనపుత్రుడు. (కొం. సూ. ప్ర.)

పురాణగాధ:— భారతములో మిగులప్రసిద్ధికెక్కిన ధృతరాష్ట్రునకు నూరుమందికొమరులు గలరనియు వారందరునుగూడ దుర్మార్గులేయనియు వారివలన తండ్రిమిగుల కష్టములనుభవించినాడనియు జెప్పబడియున్నది. పుత్రులులేని శుకుడు మిగులసుఖించెను.

మ. గ్రహదోషంబులుదుర్నిమిత్తములునీకల్యాణనామంబు ప్ర
త్యహముం బేర్కొనునుత్తమోత్తముల బాధంబెట్టఁగానో
పునే, దహనుం గప్పఁగఁజాలునే శలభసంతానంబు నీసేవఁజే
సి హతక్లేశులు గారుగాక మనుజుల్ శ్రీ... 29

తా. లోకారాధ్యా! అంగారకాది గ్రహములుగాని భూతప్రేతపిశాచములుగాని దుశ్శకునములుగాని మంగళప్రదమైన నీనామము నుచ్చరించువారిని బాధింపనేరవు. ఎట్లనగా అగ్నిహోత్రునిపైవ్రాలినమిడుతలదండువలెనే.

మ. అడుగంబోనిఁక నన్యమార్గరతులం బ్రాణావనోత్సాహినై
యడుగంబోయినఁబోదు నీదుపదపద్మారాధకశ్రేణియు
న్నడవు న్నిన్నుభజింపఁగా గనియు నాకేలాపరాపేక్షకో
రెడిదింకేమి భవత్ప్రసాదమె తగుఁ శ్రీ... 30

తా. ఆపదోద్ధారకా! క్షణమాత్రమైన యీప్రాణిని నిలుపుమని యీ, యిహవిలాసములను పెంపుసేయుమని రితి కోరికలు కోరనుగాని సేవలమునీప

దధ్యానానందమును సద్భక్తిగోష్ఠియు నీమహాప్రసాదమును నిరంతరముగోరు చుందును.

మ. మదమాతంగము లందలంబులు హరుల్మాణిక్యముల్పల్లకీల్
ముదితల్ చిత్రదుకూలము ల్పరిమళంబు ల్మోక్షమిూ(జాలునే
మదిలో వీని నపేక్షసేసి నృపధామద్వారదేశంబు(గా
చి దినంబుల్ నృథపుత్తురజ్ఞు లకటా శ్రీ... 31

తా. చంద్రమాళీ! మణిమాణిక్యములు, గజతురగాదులు, పరిమళ వ్యాపారములు, కాంతారత్నములు మున్నగునవి కొదవలేకయుండునని మోహభ్రాంతులతో నజ్ఞానులుకొందఱు రాజసన్నిధానములబడి యొడలెఱుంగక వర్తింతురు లేశమైనను నిన్ను ధ్యానింపరు. అట్టివారికి మోక్షముచేకూరునా? అట్టి దుర్దశ లెప్పుడును నాకు గలిగింపకుము.

శా. రోసీరోయదు కామినీజనులతారుణ్యోరుసౌఖ్యంబులన్
బాసీపోయదు పుత్రమిత్రజనసంపద్భ్రాంతి వాంఛాలతల్
కోసీకోయదు నామనం బకట నీపం బ్రీతిగా సత్క్రియల్
చేసీచేయదు దీనిత్రుళ్లణ(పవే శ్రీ... 32

తా. భక్తవత్సలా! దారాపుత్రాదులయందు మోహావేశపరవశమై యెంతకాల మనుభవించినను, తెంపుజేసి వైరాగ్యముతో వాని విడిచిపెట్ట లేదు. అట్టి యీామనస్సును పక్వముచేసి మోక్షేచ్ఛను పొందించి రక్షింపుము.

శా. ఎన్నేళ్లుండితి నేమిగంటి నిఁక నే నెవ్వారి రక్షించెదన్
నిన్నే నిష్ఠ భజించెద న్నిరుపమోన్నిద్రప్రమోదంబు నా
కెన్నం డబ్బెడు నెంతకాల మిఁక నే నిట్లున్న నే మయ్యెడిం
జిన్నంబుచ్చక నన్నునేలుకొనవే శ్రీ... 33

తా. దయానిధీ ! పెద్దకాలమునుండి యింతవరకు జీవించి నేనేమిసునకార్యము చేసితిని ? ముందేమిచేయగలను. కాలము వ్యర్థముగా బోవుచున్నది. ఇట్లుండిన నాగతియేమగును ? ఈపాటికైనను, నాకు ప్రసన్నుండవై జీవన్ముక్తుడను గావింపుము. నన్ను చింతిలజేయకుము.

శా. చావం గాలము చేరువౌ టెఱిగియుం జాలింపఁగాలేక త
న్నే వైద్యుం డుచికిత్సఁ బ్రోవఁ గలఁడో యేమందు రక్షించునో
యేవేల్పుల్ కృపజూఁతురో యనుచు నిన్నింతైన జింతింపఁ డా
జీవశ్రాద్ధముఁ జేసికొన్న యతియున్ శ్రీ... 34

తా. మృత్యుంజయా ! జగద్వ్యాపారమునుండి తొలగినాకు మోక్షమే గాని మఱియేమియు వద్దని పలికెడు యతీశ్వరుడుగూడ దేహారోగ్యము తప్పినపుడు మరల జీవితమందాసక్తి గలిగి వైద్యచికిత్సలమఱిగి మోహమునకు లోనగును. దృఢవైరాగ్యముగలిగి నీకటాక్షమును సంపాదించుట సామాన్యమా? కావున తండ్రీ ! నాచిత్తమును చెదరనీయక కృతార్థుడను జేయుము.

కాం. సూ. వ్రి

మ. దినముం జిత్తములో సువర్ణముఖరీతీరప్రదేశామ్రకా
ననమధ్యోపల వేదికాగ్రమున నానందంబునం బంకజా
సననిష్ఠన్ నినుఁ జూడఁ గన్న నదివో సౌఖ్యంబు లక్ష్మీవిలా
సినిమాయానటనల్ సుఖంబు లగునే శ్రీ... 35

తా. కైలాసపతీ ! అనుదినమును నీక్షేత్రవాహినియైన సువర్ణముఖియందు స్నానమాచరించి తన్నదీతీరమునవిలసిల్లు మామిడితోటయందున్న తిన్నెపైనిశ్చలదీక్షతో గూరుచుండి యోగనిష్ఠయందు నిన్ను సందర్శించిన జన్మ జన్మకాని తక్కిన మాయాస్వరూపలక్ష్మీవిలాసముల కొరకై మఱియొకటేటికార్యము ? అట్టి శాశ్వతానందమును నాకు లభింపజేయుమని ప్రార్థించెదను.

పురాణగాథ:— కాళహస్తియను గ్రామములో పూర్వమునది లేదు. వసిష్ఠమహాముని యా క్షేత్రమున కొకప్పుడు వచ్చి నదిలేనందున శంకరుని గూర్చి తపము చేయ శంకరుడు మందాకినీనదిని పంపెను. ఆయేటియందలి నీరు సువర్ణమువలె రంగుగల్గియుండుటచే సువర్ణముఖియని పేరువచ్చెను.

శా. ఆలంచు న్మెడఁగట్టి దానికినపత్యశ్రేణిఁ గల్పించి త
ద్బాలవ్రాతము నిచ్చిపుచ్చుకొను సంబంధంబుగావించి యా
మూలర్క్షంబున బాంధవంబనెడి ప్రేమంగొందలం ద్రిప్పఁగా
నీలన్నీలయమర్చిన ట్లొసఁగితో శ్రీ... 86.

తా. కాలకంఠా! భార్యయనెడు ఒకగుదికఱ్ఱను నా మెడకుబంధించితివి. అంతటితో బోనీయక సంతానములనుగల్పించి లోకబంధములలో మునుంగ జేసి తెలుపిలేనిచింతలలో నామనస్సును ద్రోసిపుచ్చితివి. ఈబాధనుండి నీవెపుడు తప్పించెదవో యని ప్రార్థించుచుంటిని.

మ. తనువే నిత్యముగానొనర్చు మదిలేదా చచ్చి జన్మింపకుం
డనుపాయంబు ఘటింపుమీ గతులరెంటన్నేర్పు లేకున్న లే
దని నాకిప్పుడెచెప్పు చేయఁగలకార్యంబున్న సంసేవఁ జే
సినినుం గాంచెదఁగాక కాలమునఁనో శ్రీ... 87.

తా. నాగభూషణా! ఈశరీరమును శాశ్వతముగానైన నిలుపుము. లేదా చనిపోయినతరువాత, తిరిగి గర్భనరకములో పడకుండనైనజేయుము. ఈరెంటియందు నీకుసమర్థతలేనిచో వెనువెంటనే నాకు దెలుపుము. అటుపి మ్మట నాశక్తివంచనలేక నీసేవజేసికొని నిన్ను గాంచ ప్రయత్నింతును.

మ. పదునాల్గేలెమహాయుగంబు లొక భూపాలుండు; చెల్లించెన
య్యుదయాస్తాచలసంధి నాజ్ఞనొకఁ డాయుష్మంతుఁడై వీరి

యభ్యుదయం బెవ్వరుచెప్పఁగావినరొ యల్పుల్మత్తులై
యేల చ, చ్చెదరో రాజులమంచు నక్కటకటా శ్రీ... 38.

తా. శూలపాణీ! హరిశ్చంద్రుడు మొదలయిన మహాచక్రవర్తులు గాదులు రాజ్యపరిపాలనచేసి యశోధనమున దుల దూగిరను ప్రసిద్ధచరిత్రములు తేటపడుచుండగా కించిజ్ఞులగు రాజులు తామే మహా ఘనులమని విఱ్ఱవీగుట తగునా?

పురాణగాధ:—పూర్వము హరిశ్చంద్రుడను నొకగొప్పచక్రవర్తులు సప్తద్వీపములతో గూడిన పుడమినంతయు పరిపాలించి అఖండైశ్వర్యముల ననుభవించి యొక్కగడ్డిపరకగూడ దీసికొనిపోలేకపోయిరి. అటువంటిసమయమున నూరేండ్లుగూడ పూర్తిగాజీవించనిరాజులుకొందరు తామెంతో గొప్పవారమని గర్వపడుచు శివునియారాధించుట పూర్తిగామాని మిగుల పాపములను జేసి చనిపోవుచున్నారు.

శా. రాజన్నంతనెపోవునా కృపయు ధర్మం బాభిజాత్యంబు వి
ద్యాజాతక్షమ సత్యభాషణము విద్వన్మిత్రసంరక్షయుక్
సౌజన్యంబు కృతం బెఱుంగుటయు విశ్వాసంబుగాకున్న దు
ర్బీజశ్రేష్ఠులుగాఁ గతంబుగలదే శ్రీ... 39.

తా. మహాదేవా! రాజశబ్దము ధరించి సింహాసనముపై కూర్చుండినంతమాత్రముచే ధర్మాచరణమును సత్యసంధతయు సాధుభూషణము మున్నగుసద్గుణపుంజము విడువవలయునా? సత్కీర్తివంతులగు చక్రవర్తు లెందరు లేరు? అట్టిభాగ్యము నీచాధములైన రాజులకు పట్టుబడదు.

మ. మును నీచే నపవర్గరాజ్యపదవీమూర్ధాభిషేకంబు గాం
చిన పుణ్యాత్ములు నేను నొక్కసరివో చింతించి చూడంగ నె
ట్లనినం గీటఫణీంద్రపోతమదవేదండోగ్రహింసావిచా
రిని గాఁగా నినుఁ గానఁగాక మదిలో శ్రీ... 40.

తా. మునివంద్యా! పూర్వము మహాతపోధనులైననీయొక్క కటాక్షమునుగాంచి సిద్ధులైన మహాత్ములతో నేను సరిపోలుదును. ఎట్లనఁగా సాలెపురుగు, సర్పము, యేనుగు మొదలగు జంతుసముదాయములు మనస్సిద్ధిగా నిన్నుపూజించి ముక్తినిబొందలేదా? అట్లే నాశక్తికొలంది నిన్నుపూజించితిని. నాకు మోక్షమునిమ్ము.

పురాణగాథ:—సాలెపురుగు, సర్పము, యేనుగు, చెంచు మొదలగు వారికథలు 18 వ పద్యముచివరను వ్రాయబడియున్నవి.

మ. పవమానాశనభూషణప్రకరము ల్భద్రేభచర్మంబు నా
టవికత్వంబు ప్రియంబులై భుజగసుండలాటవీచారులన్
భవదుఃఖంబుల బాపుటొప్పఁగొలదిం బాటించి కైవల్యమి
చ్చి వినోదించుట కేమికారణమయా శ్రీ॥ 41.

తా. మన్మథాంతకా! లెస్సగా సర్పములను ఆభరణములుగా నీవుధరించుటచేతను, గజచర్మమే వస్త్రముగా కలిగియుండుటచేతను. అర్జునునికి పాశుపతమిచ్చినసందర్భమున కిరాతవేషధారివైయుండుటచేతను, నీవతిప్రీతితో సర్పమును, ఏనుగును, ఎఱుకువానిని రక్షించితివి. లేకుండిన నెట్లుగల్గును? అనగా నీవిలాసము పెక్కుభంగులుగానుండుననియు నీభక్తులయెడల జాతిమతభేదములు పాటింపక సమరసభావముతో పాలింతువని నమ్మెదను.

మ. అమరస్త్రీలరమించినం జెడదు మోహంబింతయుంబ్రహ్మప
ట్టము సిద్ధించిన లాసదీఱదు నిరూఢక్రోధముఁ సర్వలో
కములన్మ్రింగిన మాన దిందుఁగల సౌఖ్యంబొల్ల నీసేవఁజే
సి మహాపాతకవారాశిఁ గడతుఁ శ్రీ... 42.

తా. దేవదేవా! రంభా, యూర్వశిమొదలగు దేవతాస్త్రీలను గూడినప్పటికి మోహపిశాచము విడదు. స్వర్గసింహాసనము లభించినను ఆశాపాశ

ము లేగదు. లోకములన్నియు దిగమ్రింగినను క్రోధమహాశత్రు తృప్తినొందదు. కనుక వానిని దూరముగాదోలి నిరంతరానందదాయకమగు నీనిశ్చలసేవనొన ర్చినారొక్క మహాపాతకములను బాపుకొనజాలుదును.

మ. చనువారిం గని యేడ్చువారు జముఁడా సత్యంబుగా వత్తుమే
మనుమానం బిఁకలేదు నమ్ముమని తా రావేళనా రేవునన్
మునుఁగంబోవుచు బాసచేయుటనుమీ ముమ్మాటికిం జూడఁ
గా, చెనఁటు ల్గానరు దీనిభావ మిదిగో శ్రీ... 43.

తా. సాధురక్షకా! చనిపోయినవారినిగూర్చి పామరులుకొందరు వృథాదుఃఖములపాలైయుందురే గాని మృతిదినమున తామాచరించు స్నాన ముయొక్క భావమును గుర్తెరుగరు. ఏమనిన మృతినొందినవారివలెనే జీవిం చినవారును కొంతకాలమునకు లోకమునువిడిచెదువారని దానిభావము. ఎవ్వరును శాశ్వతముగనుండువారులేరు. నీవొక్కఁడవే శాశ్వతుడవు. అట్టి దుఃఖమునువిడచి నిన్నుగొలిచినచో శాశ్వతానందము సిద్ధించునవిభావము.

మ. భవదుఃఖంబులు రాజకీటములనేఁ బ్రార్థించినం బాయునే
భవదంఘ్రిస్తుతిచేతఁగాక విలసద్బాలక్షుధార్త్తిక్లేశ దు
ష్టవిధు ల్మానునె చూడ మేఁకమెడచంటం దల్లికారుణ్యదృ
ష్టివిశేషంబున నిచ్చుచంటబలె నో శ్రీ... 44

తా. కలుషహరణా! ఎన్నటికినిపాయరాని యీజన్మదుఃఖసాగరము పశుప్రాయులైన రాజాధములను కొలిచినంతమాత్రమున దాటశరమా? సర్వాంతర్యామివైన నీసేవచేయక తరుణోపాయము కలుగదు. జగద్రక్షకుడ వైననిన్ను విడచి యల్పులనాశ్రయించినచో అల్పభాగ్యములే సిద్ధించును. ఎట్లనిన మేకపిల్లలు తల్లియొక్క పొదుగునపాలుకుడిచిన యాకలిదీరునుగాని మెడభాగమందలి చన్నులుకుడిచిన నాకలిదీఱదు. నిశ్చలానందస్వరూపుఁడవై ననిన్ను పాసించినచో భక్తులును నట్టియానందస్వరూపు లగుదురు.

మ. పవి పుష్పంబగు నగ్నిమంచగు నకూపారంబు భూమీస్థలం
బవు శత్రుండతిమిత్రుఁడౌ విషము దివ్యాహారమౌ నెన్నఁగా
నవనీమండలిలోపలన్ శివశివేత్యాభాషణోల్లాసికిన్
శివ నీనామము సర్వవశ్యకరమౌ శ్రీ... 45.

తా. పరంధామా! నిరంతరము నీయెడ దృఢవిశ్వాసముగలిగి పూజించు మహాభక్తులకు నరకబోవు వజ్రాయుధము పుష్పమగును. దహింపజేయు అగ్ని మంచుగా మారిపోవును. తరింపరాని సముద్రము భూప్రదేశముగా మారిపోవును. బాధకుడగు మహాశత్రువు మిత్రుడుగా మారును. మ్రింగరాని విషము అమృతమగును.

శా. లేవో కానలఁ గంధమూలఫలముల్ లేవో గుహల్ తోయ
ముల్, లేవో యేఱులఁ బల్లవాస్తరణముల్ లేవో సదాయా
త్మలో, లేవో నీవు విరక్తులన్మనుప జాలింబొంది భూపాలురన్
సేవ ల్సేయఁగఁ బోదు రేలొకొ జనుల్ శ్రీ 46

తా. దైత్యసంహారా! తమయొక్క కాలమును వ్యర్థము చేసి మోక్షమార్గమును లేశమును విచారింపక క్షణభంగురమైన ప్రాణిని పోషించుటకు నీచపురాజులసేవింపనేల? సుఖముగా, నిర్విచారముగా, జన్మసార్థకముగా నీవుసృష్టియందు దయచేసియున్న కందమూలాదులభక్షించుచు, నదులయందుగల మధురోదకముల పానముసేయుచు, గుహలయందు, నీతపోనిష్ఠయందుకాలముగడుపుట మేలుకాదా?

మ. మును నేఁ బుట్టినపుట్టులెన్నిగలవో మోహంబుచే నందుఁ జే
సినకర్మంబులప్రోవు లెన్నిగలవో చింతించినం గాన నీ
జననంబే యని యున్నవాఁడ నిదియే చాలింపవే నిన్నుఁ గొ
ల్చినపుణ్యంబునకుం గృపారతుఁడవై శ్రీ... 47

తా. గౌరీమనోహరా! ఇంతకుముం దెన్ని జన్మ లైనవో, ముందు కాను న్నవో, యెఱుంగజాలను. నిన్ను భక్తితో చాలకాలమునుండి పూజించుచు, నీపాదములాశ్రయించిన నాసుకృతమునకు దయారసము చిలికి ముందెన్నటికి గర్భనరకప్రయాసమును నాకు సంభవింపకుండునటుల జేయుము అనగా యిదివరకు నీసేవలేకుండుటచే నీజన్మతటస్థించెను. ఇప్పుడు నీసేవసేయుచుంటిని గాన నాకు జన్మరాహిత్యము గలుగజేయుమని ప్రార్థించుచున్నాను.

మ. తను వెందాఁక ధరిత్రినుండు నను నందాక న్మహారోగదీ
పనదుఃఖాదులఁ బొందకుండ ననుకృపాదృష్టి వీక్షించి యా
వెనుక న్నీ పదపద్మము ల్దలఁచుచు న్విశ్వప్రపంచంబుఁ బా
సినచిత్తంబున నుండఁజేయఁగదవే శ్రీ... 48

తా. దయామయా! నాశరీరమెంతకాలము నిలిచియుండునో యంతకాలమును రోగపీడితునిగను, విచారగ్రస్తునిగను జేయక, నీపదపద్మాసక్తి పెంపొందజేసి తదనంతరము ముక్తునిగాజేయుము.

మ. మలభూయిష్ఠమనోజధామము సుషుమ్నా ద్వారమో యా
రుకుం, డలియో పాదకరాక్షియుగ్మములు షట్కంజంబులో
మోముదా, జలజంబో నిటలంబుచంద్రకళయో సంగంబు
యోగంబుగా, సిలిసేవింతురు కాంతలన్ భువిజనుల్ శ్రీ...

తా. త్ర్యంబకా! మాయావిలాసములతోగూడి నరకమను సముద్రములో మునుగజేయునట్టియు ఏహ్యాస్పదమైనట్టియు నారీమణులపొందు మహాపదవిగాభావించి మూఢులు సదా మోహావేశులగుచుందురు. ముక్తికిదూరులగుదురు. అట్లుగాక సద్గురుపాదారవిందముల నాశ్రయించి నిర్మలదీక్షతో వేదవేద్యుండవై స్వయంప్రకాశుండవై సహస్రారకమలమునవికసించు నిన్ను గాంచరాదా? అనగా విషయవాసనారహితునిజేసి నన్ను బ్రోవుమని భావము.

మ. జలకంబుల్ రసముల్ ప్రసూనములు వాచాబంధముల్ వా
ద్యము, ల్కలశబ్దధ్వను లంచితాంబర మలంకారంబు దీప్తు
ర్మేలుం, గులు నైవేద్యము మాధురీమహిమగాఁ గొల్తు
న్నినుం భక్తి రంజిల దివ్యార్చనగూర్చి నేర్చినక్రియన్ శ్రీ

తా. శంభో! పూర్వజన్మసుకృతపరిపాకముచేత నేటికి సద్గురు బోధ వలననాకు లభించిన నీయారాధనయందు సమస్తోపచారములను జూపుచునా శక్తికొలదిని సీలములను నడపుచుకాలము పుచ్చుచుంటిని. ఇందలిలోపము లెల్లను మన్నించి నావిన్నపమంది కృతార్థుని జేయుము.

శా. ఏలీల న్నుతియింపవచ్చు నుపమోత్ప్రేక్షాధ్వనివ్యంగ్యశ
బ్దాలంకారవిశేషభాషల కలభ్యం బైననీరూపముం
జాలుంజాలుఁ గవిత్వము న్నిలుచునే సత్యంబు వర్ణించుచో
ఛీ! లజ్జింపరుగాక మాదృశకవుల్ శ్రీ... 51.

తా. వేదవేద్యా! మహాకవులెందఱోనియు నీమహిమలను వర్ణింప దొడంగిరి. దేవతలు సహితము నీతత్త్వమును దెలియ యత్నించిరి. కాని సంపూర్ణమనోరథ సిద్ధులగుట దెలియరాదు. అట్టివిషయమున ననుబోటికించిజ్ఞుల కెట్లు సాధ్యమగును? నీమహిమ నీకే తెలియును గాని యొరులకు దుస్తరము.

శా. పాలుం బువ్వయు బెట్టెదం గుడువరాపాపన్న రాయన్న లే
లే లెమ్మన సరంటిపండ్లుఁ గొనితే లేకున్న నే నొల్లనం
చే లాలింపరె తల్లిదండ్రు లవు డట్లే తెచ్చి వాత్సల్య ల
క్ష్మీలీలావచనంబులం గుడువరా శ్రీ... 52.

తా. కపాలపాణీ! లోకమునందు తలిదండ్రులు తమబిడ్డను ప్రేమతో లెమ్మురమ్మని పిలిచినపుడు వాడతిచలమున తనకుగావలసినఫలాదులను తెచ్చి

యున్మాని పుట్టుకట్టినరోడల వాని మొఱ్ఱలట్లు దీర్చితో యట్లే నీభక్తుండనైన నేను ముక్తి నొసగుమని కోరితిని కావున నాకోరిక చెల్లింపుమని భావము.

మ. కలలంచున్శకునంబులంచు గ్రహయోగంబంచుసాముద్రికం
బులటంచుం దెవులంచుదిష్టమనుచు న్భూతంబులంచున్విషా
దులటంచు న్నిమిషార్థజీవనములందుం బ్రీతిఁబుట్టించి యీ
సిలుగుల్ ప్రాణుల కెన్ని చేసితివయా శ్రీ... 53.

తా. అంబికేశ్వరా! ఈజీవుల నేలబుట్టించితివి. అట్లుబుట్టించుటయే గాక మహాగాధలుగ, సాముద్రికములనియు గ్రహములనియు దుశ్శకునముల నియు తెలిపిలేని సంశయమహారణ్యములను గల్పించితివి. నీవిలాసములద్భుతములు. నీకటాక్షములేనిచో నిట్టియింద్రజాలమును గ్రహించుటకెవ్వరికేని సాధ్యమా? కనుక తండ్రీ నన్నుమాయను బడద్రోయక జ్ఞానచంద్రికనిదియు ద్ధరింపుము.

మ. తలమీఁదం గుసుమప్రసాద మలికస్థానంబుపై భూతియున్
గళసీమంబున తండ నాసికతుద న్గంధప్రసారంబు లో
పల నై వేద్యముఁ జేర్చు నేమనుజుఁ డాభక్తుండు నీకెప్పుడుం
జెలికాఁడై విహరించు రౌప్యగిరిపై శ్రీ... 54.

తా. మేరుధన్వీ! ఎవ్వడు శివారాధనపరుడై భస్మరుద్రాక్షధారణ గలిగియుండి నీతత్వపరిశీలన జేయుచు నీప్రసాదమును స్వీకరించుచు పావన చరితుండగునో వాడు తప్పక నీసన్నిధానమును సంపాదింపగలడు. పామరులకు చేకూరదు.

శా. ఆలుం బిడ్డలు మిత్రులున్ హితులు నిష్టార్థంబు లీనేర్తు రే
వేళ న్వారి భజింపఁ జాలిపడ కావిర్భూతమోదంబునం

గాలంబెల్ల సుఖంబు నీకు నిఁక భక్తశ్రేణి రక్షింప కే
శ్రీ లెవ్వారికిఁ గూడఁబెట్టెదవయా శ్రీ... 55

తా. మురారిప్రియా ! దారాపుత్రాదులయందు చిరకాలమునుండి పాదుకొనియున్న మోహమనుపాశమును ద్రెంచి, వైరాగ్యమువహించి, సన్మార్గమననుసరించి, నిన్నుసేవించు భక్తవరుల పరిచర్యలకానందించి, నీయధీనమందు విలసిల్లు మహాభాగ్యముల కరుణించి యొసంగక యొఱులెవ్వరికిగూడ బెట్టెదవు ? కనుక నీభక్తుఁడనుగాన నన్నువిడువక గావుము.

మ. సులభుల్మూర్ఖులు నుత్తమోత్తములు రాజుల్గల్గి యేవేళ న
న్నలఁతం బెట్టిన నీపదాబ్జములఁ బాయం జాల నేమిచ్చినం
గలధౌతాచల మేలు టంబునిధిలోఁ గాపుండు టబ్జంబుపైఁ
జెలువొప్ప న్సుఖియింపఁ గాంచుట సుమీ శ్రీ... 56.

తా. వృషభవాహనా ! ఏరాజులుగాని బలవంతముగనైన నాకేమి సమర్పించినను ఆవస్తువులకు నేను దృష్టిపొందువాఁడనుగాను. నీపాదకమలముల నర్చించి మహానందజలధిలో నోలలాడుచు జన్మరాహిత్యమను మహాపదవికే యాశించియుంటిని.

పురాణగాధ:—శివునిభార్యయు దక్షునికొమరితయునగు సతీదేవి దక్షుడుగావించిన యజ్ఞములో ప్రాణత్యాగముచేయగా శంకరుడు వైరాగ్యముతో పద్మాసనమువేసికొనికూర్చుండి ఆత్మానుసంధానముచే అఖండానందస్వరూపుడై యుండెను.

శివపురాణమునందిట్లుచెప్పబడియున్నది. నూరుబ్రహ్మకల్పములొక విష్ణుకల్పము నూరువిష్ణుకల్పము లొకశివకల్పము నూరుశివకల్పములుజరిగిన మహాప్రళయముకలుగును. అంతట నీభూలోకమంతయు జలప్రళయముగా మహాసముద్రమునుండి శివుడు శంఖమూదును.

మ. కలధౌతాద్రియు నస్థిమాలికయు గోగంధర్వమున్బున్కయుం
బులితోలుంభసితంబుఁబాఁపతొడవుల్పోకుండఁదోఁబుట్లకై
తొలి నేవారలతోడఁ బుట్టఁగఁ గళాదుల గ్గల్గె మేలయ్యెనా
సిలువు ల్ద్వారముచేసికొం టెఱుఁగియే శ్రీ... 57.

తా. విశ్వేశ్వరా! నీవు బహుచమత్కారివనితోచుచున్నది. ఏల యనగా వెండికొండయు పుర్రెలహారమును చంద్రకళయును మొదలగు సమస్త సామగ్రియు నీవేఅనుభవింపుచూ పాలుపెట్టుటకు నీతోమరియెవ్వరిని జనింపజేయవైతివి. అనగా ఈశ్వరుడు స్వయంభువుఅనియును ఎందుజూచిన నతనితో సమానులు మఱియెవ్వరులేరనియు సర్వాధిపతియతడే యనియు, నిట్టిస్వాతంత్ర్యముగలశివుడే మోక్షప్రదాతయని తాత్పర్యము.

పురాణగాథ:— మొదట బ్రహ్మకు అయిదుతలలుండెడివి. దక్షుని కొమరితయగు సతీదేవిని శివుడు వివాహముజేసికొనుసమయమున బ్రహ్మపురోహితుడుగానుండి యామెను మోహించెను. అది శివుడుగనిపెట్టి తనచేతితో గొట్టగా మధ్యతలతెగి శివునిచేతికంటుకొనెను. అంతట బృహస్పతి శివునికిట్లుచెప్పెను, ఈపుఱ్ఱెనుబట్టుకొని భిక్షమునకై బయలుదేరుము. అంతనెవరుమొదట నీకు దీనియందు భిక్షముపెడుదురో వారికీదోషమంటుకొనును నీకు దోషముండదు. అంత ప్రతివారును తమభార్యలకు పుర్రెతోభిక్షమునకువచ్చినవారికి భిక్షనిడవలదని యాజ్ఞాపించిరి. గాని లక్ష్మీదేవికిమాత్రము తెలియక యామెముత్యములు భిక్షనిడగా శివునిచేతిబ్రహ్మకపాలమూడిపోయెను.

మ. శ్రుతులభ్యాసము శాస్త్రగరిమ ల్శోధించి తత్వంబులన్
మతినూహించి శరీర మస్థిరము బ్రహ్మంబెన్నసత్యంబుఁగాం
చితి మంచున్ సభలన్ వృథావచనము ల్చెప్పంగనేకాని ని
ర్జితచి త్తస్థిరసౌఖ్యముల్ దెలియరో శ్రీ... ౫౮.

తా. గంగాధరా ! మేము వేదాధ్యయనసంపన్నులమనియు మహాతత్వవేత్తలమనియు బ్రహ్మత్వముమాకుసిద్ధించినదనియు సభాస్థానములపండితులు పరిగణ్యములువచించుటేకాని నిశ్చలభక్తితో నీయందుమనస్సునిలిపి నీకటాక్షమును పొందలేరు. సంశయములను విడువలేరు.

మ. గతి నీ వంచు భజించువార లపవర్గం బొందఁగానేల సం
తతముం గూటికినై చరింప వినలేదా 'యాయురన్నంప్రయ
చ్ఛతి'యంచు న్మొఱవెట్టఁగా శ్రుతులుసం సారాంధకారాభి
దూ,షితదుర్మార్గులు గానగానబడవో శ్రీ॥ 59

తా. దైవరాయా ! సమస్తజగంబులకు కర్తనై జీవకోటిలన్నిటికి సృష్టిస్థితిలయ హేతుభూతుడనై నీవుండగా నిన్నునమ్మి భజించెడు భక్తులు విగతదోషులై ముక్తిని వడయుచుండగా గాంచియు పామరులు కొందఱు తమయందే కర్తృత్వమును వహించి ఉదరపోషణార్థమై జన్మధరించినట్లు భావించినిన్ను మఱచి వృధాకాలము గడపుదురు. ముందుగతి గానలేరు. వేదమందు దృఢమైన విశ్వాసముంచలేరు.

మ. రతిరాజుద్ధతిమీఱి నొక్కముటికోరాజాశ్వ నిన్నొక్కఁబో
నతఁ డాదర్పకు వేగనొత్తఁగవయంబాఁబోతునుం దాఁకియు
గ్రితఁబోరాడఁగ నున్న యన్నడమిలేఁగల్వోలె శోకానల
స్థితిపాలై మొఱవెట్టినన్ మనుపవే శ్రీ॥... 60.

తా. దీనచింతామణీ! మన్మధుడు నీకువిరోధియగుటచే నీసంబంధమైన భక్తులను నీయడల నిశ్చలభక్తి చెందనీయక చిక్కులు బెట్టుచుండును. అనుగ్రహానిగ్రహసమర్థుండవైన నీకు మాబాధలు మాన్ప తృణతుల్యములుగదా! కావున నామనంబున నేవికారములు నిలువనీయక భక్తి దృఢపఱచి శత్రుబాధలనుండి రక్షించుటకు ప్రార్థించెదను.

శా. అంతా సంశయమే శరీరఘటనం బంతా విచారంబె లో
నంతాదుఃఖపరంపరార్జితమె మేనంతా భయభ్రాంతమే
యంతానాంతశరీరశోషణమె దుర్వ్యాపారమే దేహికిన్
జింత న్నిన్నుఁ దలంచి పొందరు నరుల్ శ్రీ... 61.

తా. బ్రహ్మాండనాయకా! ఈపాపిష్టిశరీరము కేవలమురోగపీడితము దుఃఖనిలయము మనస్సు జూచినా సంశయములతో నిండియుండును. నిరంతరము అనేకబాధలతో శుష్కించుచుండును చేసెడిదంతయు దుర్వ్యాపారమేకాని సద్గోష్ఠి లేశమైననంటదు. ఇట్టిదుర్దశనుమాన్పి నీపదపద్మముల నిశ్చలభక్తినిలుపుము.

శా. సంతోషించితిఁ జాలుఁజాలు రతిరాజద్వారసౌఖ్యంబులన్
శాంతిం బొందితిఁ జాలుఁజాలు బహురాజద్వారసౌఖ్యంబు
లన్, శాంతిం బొందెదఁ జూపుబ్రహ్మపద రాజద్వారసౌఖ్యం
బు నిశ్చింత న్శాంతుఁడ నౌదు నీకరుణచే శ్రీ... 62.

తా. జగద్రక్షకా! ఇంతకుమున్ను యిహలోకసుఖవిలాసముల మఱిగి నానావ్యాపారముల దిరిగి రొయిందును కొఱగాక తఱుణోపాయముకొఱకు నేటికి గన్నుతెఱచి నీచరణసరసీరుహంబుల నాశ్రయించితిని. ఇకనైన నాయందు కటాక్షమునిలిపి నన్నుధన్యునిజేయుము.

శా. స్తోత్రిం బన్యులఁ జేయనొల్లనివ్రతస్థుల్వోలె వేసంబుతోఁ
బుత్రీపుత్రకళత్రరక్షణకళాబుద్ధిన్ నృపాలాధమున్
బాత్రంబంచుభజించఁబోదు రిదియున్నాభవ్యంబెయెవ్వారిచా
రిత్రిం బెన్నుఁడు మెచ్చు నెంచ మదిలో శ్రీ... 63,

తా. సదాశివా! కొందఱు డాంభికమునకు పరులనుతింపమను నీలమునుధరించినట్లు నటనయందుచూపుచు క్రియకు రాజాధములకు కృతులు సమర్పించి వారిని పొగడి జీవనమును నెఱపుచుందురు. నేనట్లుసేయఁజాలను. కేవలము నీసంస్తుతులకుమాత్రమే నాకవిత్వమును సమర్పించితిని.

మ. అకలంకస్థితినిల్పి నాద మనుఘంటారవమున్ బిందుదీ
పకళాశ్రేణివివేకసాధనము లొప్పన్ జ్ఞాని యానందదా
పకదుర్గాటవిలో మనోమృగము గర్వస్ఫూర్తి వారించు వా
రికిఁగా వీనుభవోగ్ర బంధలతికల్ శ్రీ ... 64.

తా. ఆపద్బాంధవా! ఏమానవుడు వేటకాండ్రు లేడి నరణ్యమున బంధించినవిధమున మనస్సనియెడులేడిని దుర్వృత్తులనుండి తొలగించి నీభక్తి యనెడు పాశముబంధించునో వాడు భవసాగరమును తరించును. అన్యుడు తరింప నేరడు.

మ. ఒకయర్థంబును నిన్ను నే నడుగఁగా నూహింపనెట్లైనఁ బో
మ్ము కవిత్వంబులు నాకుఁ జెంద నివియేమోయంటివా నాదుజి
హ్వకు నైశర్గికకృత్యమింతయనుమీ ప్రార్థించుటే కాదు కో
రికల నిన్నును గాన నాకువశమా శ్రీ ... 65.

తా. భక్తమందారా! నీవొకవేళ నేనుచెప్పుకవిత్వముతో ప్రసన్నుడవు కాకపోవచ్చును. అయినప్పటికి నాకుకవిత్వముచెప్పుట స్వాభావికముగాన ఆరూపముగా నిన్ను ప్రార్థనచేయుచుందును. నే నెన్నికోరికలు పెట్టుకొన్నను అంతమాత్రముచే నిన్ను తెలియజాలను. కనుక ఏప్రొద్దుచూచినను విశేషముగ నిన్ను ప్రార్థించుటయే నాపనియైయున్నది. కరుణాంతరంగమున నావిన్నపములఁగైకొని నన్నుబ్రోవుము.

మ. శుకము ల్కింశుకపుష్పముల్గని ఫలస్తోమం బటంచు న్సము
త్సుకతం జేరఁగఁ బోవ నచ్చట మహాదుఃఖంబు సిద్ధించుఁగ
ర్మకళాభాషలకెల్లఁ బ్రాపు లగు శాస్త్రంబుల్విలోకించు వా
రికి నిత్యత్వమనీష దూరముగదా శ్రీ 66

తా. సురసార్వభౌమా! చిలుకలు మోదుగపుష్పములను తమకుప్రియములైన ఫలములుగా భావించి వానిని సమీపించుతఱిని విఫలమనోరథులైనవిధముగా శాస్త్రజ్ఞులు కొందరు కేవలము కర్మకాండలే తమకు మహాఫలములిచ్చునని పేరాసతో వానియందు మునిఁగియుండుటయేకాని నిశ్చలజ్ఞానసంపన్నులై నీకటాక్షము పొందలేరు.

మ. ఒకరిం జంపి పదస్థులై బ్రతుకఁగా నొక్కొక్క రూహింతురే
లొకో తామెన్నఁడుఁ జావరో తమకుఁ బోవో సంపదల్ పుత్రమి
త్రకళత్రాదులతోడ నిత్యసుఖమందం గందురో యున్నవా
రికి లేదో మృతి యెన్నఁడుం గటకటా శ్రీ ... 67.

తా. భువనమోహనా! దుర్మార్గులుకొందఱు పరులకు ఏవిధముగానైనను హానిచేసి అందువల్ల తమకు గొప్పలాభము గలుగునని వెఱ్ఱిభ్రాంతిపడుదురేగాని పరమదయాళువైన నీయాజ్ఞ మఱలయెట్లువచ్చునో గుర్తెరుగరు. అకారణముగా నితరులను హింసించువాడు తానేపాటివృద్ధికివచ్చును.

శా. నీకారుణ్యముఁ గల్గినట్టినరుఁ డేనీచాలయంబుం జొరం
డేకార్పణ్యపుమాట లాడ నరుగం డెవ్వారితో వేషముల్
గైకోఁ డేమతము ల్భజింపఁ డిల నేకష్టప్రకారంబులన్
జీకాకై చెడిపోఁడు జీవనదశన్ శ్రీ... 68.

తా. మానివంద్యా! నిజమైననీభక్తుఁడు ఏకదీక్షతో నెక్కడఁజూచి నను నీవుతప్ప అన్యములేదని మతధర్మానుసారముగ విశ్వసించియుండును. అట్లుగాక మఱియొకమతావలంబనచేసినచో మతభ్రష్టుడుకాఁడా? మఱియును ఇతరులనెవ్వరిని తానునమ్మవలసినపనిలేదు. అట్లుండినచో తప్పక నీపరిసాదము వడయునని భావము.

శా. జ్ఞాతుల్ ద్రోహులు వారు సేయుకపటేష్వాదిక్రియాదోష
ముల్, మాతండ్రిన సహింపరాదు ప్రతికర్మం బించుకేఁ
జేయంగాఁ, బోతే దోషముగాన మాని యతినై పోఁగోరి
నన్ సర్వదా, చేతఃక్రోధము మాన దెట్లు నడుతున్ శ్రీ...

తా. దయాంభోనిధీ! దాయాదులు పెట్టుకష్టములను ఎంతవరకు సహించను. తిరిగి ప్రత్యపకారము వారికిచేయఁజాలను. యతీశ్వరుడనై యుండినచో యెదననిన మనస్సుననుండు క్రోధము చావదయ్యెను. క్రోధమున్నంతవరకు జితేంద్రియత్వము పట్టుపడదయ్యె. ఇంద్రియములను జయించక ఎట్టివాడును మోక్షము వడయలేదు. కావున నీదుర్దశనుండి రక్షింపుము.

కాం. సూ. ప్రి.

మ. చదువుల్నేర్చినపండితాధములు స్వేచ్ఛాభాషణక్రీడలన్
వదరన్ సంశయభీకరాటవులఁ ద్రోవల్దప్పి వర్తింపఁగా
మదనక్రోధకిరాతు లందుఁ గని భీమప్రౌఢిచేఁ దాఁకినం
బెదరుం జిత్తము చిత్తగింపఁగదవే శ్రీ... 70.

తా. రజితాద్రినిలయా! సమస్తశాస్త్రములను చదివిచదివి మేము మహాపండితులమనిచెప్పెడువారిలో ననేకులు సంశయములనెడి మహారణ్యములందుబడి కామక్రోధాదులుఅనుకిరాతులచే పీడింపబడుటయేగాని సత్వగుణప్రధానులై నిశ్చలభక్తితో నిన్నుగాంచుట దుస్తరముగదా! నిశ్చలమైన భక్తిభాగ్యము కరతలామలకముగనుండువారికి చదువులతో పనియేమి?

శా. రోసిం దేటిది రోఁత లేటివి మనోరోగస్థుఁడై దేహితాఁ
బూసిం దేటిది పూఁతలేటివి మదాపూర్ణంబు లీదేహముల్
మూసిం దేటిది మూఁత లేటివి సదా మూఢత్వమే కాని
తాఁ, జేసిం దేటిది చేఁత లేటివి, వృథా శ్రీ... 71

తా. పినాకపాణీ! డంబాచారపరాయణులు కొందఱు తాము వేష ములచేత అనగా భస్మగంధాద్యలంకారములచేతను ప్రగల్భవాక్యములచేతను లోకులను నమ్మింతురు. కాని తమదుర్గుణములను విడచి నిర్మలానందమును గలిగి నిన్ను భజింపనేరరు. అట్టివారికి జన్మసాఫల్య మెట్లు?

శా. శ్రీశైలేశు భజింతునో యభవుఁ గాంచీనాథుఁ సేవింతునో
కాశీవల్లభుఁ గొల్వఁబోదునొ మహాకాళేశుఁ బూజింతునో
నాశీలం బణువైన మేరువనుచున్ రక్షింపవే నీకృపా
శ్రీశృంగార విలాసహాసములచేఁ శ్రీ... 72.

తా. అభ్రకేశా! నాహృదయనివాసుండవై నిశ్చలభక్తియనుసూత్ర ముచే నీవిక్కడ నాకు ప్రసన్నుండవు కాగలవు. అట్టిభక్తిని నిలుపుకొనలేక మహాపుణ్యక్షేత్రములని తెలియంబడు శ్రీశైలాదిదివ్యస్థలంబులకు పోయినను నీప్రసాదమును వడయుట దుస్తరముగదా! నేను తీర్థాటనముకంటె సద నంబున నిలచిన నీయారాధనసలుపుట మోక్షసిద్ధిగల్గునని నమ్మియుంటిని.

మ. అయవారై చరియింపవచ్చుఁదనపాదాంభోజతీర్థంబులన్
దయతోఁ గొమ్మనవచ్చు సేవకుని నర్థప్రాణదేహాదు ల
న్నియు నాసొమ్మనవచ్చుఁగాని సిరుల న్నిందించి నిన్నాత్మని
ష్క్రియతం గానఁగరాదు పండితులకున్ శ్రీ... 73

తా. కాలదమనా! అతికాంక్షాపరులై, మేము మయ్యావారలమని పటాటోపముగ కేవలవేషధారులై, యొఱుల విత్తంబుల, మనంబుల, నపహరించుటకు మాయమాటలజెప్పుచుందురు. చెప్పెడిమాటలకును నడిచెడినడతలకును సంబంధముండదు. అటువంటి కలుషహృదయులకు నీపదవి సిద్ధించునా?

శా. మాయాజాండకరండకోటిఁ బొడిగా మర్దించిరో విక్రమా
జేయుం గాయజుఁ జంపిరో కపటలక్ష్మీమోహముం బాసిరో
యాయుర్దాయభుజంగమృత్యువునవాయాసంబునన్ గెల్చిరో
శ్రీయెూదాయకు లౌదురెట్లితరుల్ శ్రీ... 74

తా. భక్తవరదా! నీసామర్థ్య మిట్టిదట్టిదని వర్ణింపజాలను నీకుగల బిరుదావళులు ఎవ్వరికిగలవు నీవుజయించిన మన్మథుడు మొదలైన మహాశత్రువుల నెవ్వరుజయించిరి. ఏవిషయమందును నీయట్టిసమర్థుడు లోకము లెల్లను వెదకిచూచిన గానరాడు. నిన్నాశ్రయించిన నావంటిభక్తునకు మనోరథ మేలచేకూరదు?

పురాణ:—రతీదేవిభర్తయగు మన్మథుడు దేవతలచే ప్రోత్సహింపబడి శంకరుడు మిగుల నిష్ఠగా తపస్సుజేయుతతిని కొందఱుస్త్రీలు తనవద్దనున్నసమయమున కామమును జనింపజేయగా శివుడు తనమూడవనేత్రముచే మన్మథుని దహింపజేసెను. రతీదేవి శివునిప్రార్థించి పతిభిక్షపెట్టుమనగా నీకుమాత్రమే నీభర్త నిజరూపముతో గాన్పించునుపొమ్మని వరమిచ్చి పంపెను.

మ. చవిగాఁజూడ వినంగ మూర్కొనన దనూసంఘర్షణాస్వాద
మొందవినిర్మించెద వేల జంతువుల నేతత్క్రీడలే పాతక
వ్యవహారంబులు సేయునేమిటికి మాయావిద్యచేఁ బ్రొద్దుపు
చ్చ వినోదింపగ దీన నేమిఫలమో శ్రీ... 75

తా. గజాసురమర్ధనా ! లోకములో దుర్మార్గులనేకులు తమకు నీచే ప్రసాదింపబడిన శరీరావయవములు అనచక్షురాదియింద్రియములు సుకృతార్థమువినియోగింపక దుష్కృత్యములయందే ప్రయోగింతురు. అట్టివారు తమ దుష్కర్మలకు తగిన ఫలితమును అనుభవింపకుందురా ? నీయొక్కభావమును లేశమైనను గ్రహింపలేరుగదా !

మ. వెనుకం జేసిన ఘోరదుర్దశలు భావింపంగ రోఁతయ్యెడున్
వెనుక న్ముందట వచ్చుదుర్మరణము ల్వీక్షింప భీతయ్యెడున్
ననునేఁజూచియునా విధుల్దలఁపఁగా నా కేభయంబయ్యెడుం
జెనకుం జీఁకటి నాయెఁ గాలమునకున్ శ్రీ... 76

తా. సాధుపోషణా ! గతజన్మములయందు ఎన్నిమహాపాతకములు సల్పియుంటినో లేకున్న మాతృగర్భమను నరకమునకొన్నినాళ్ళను భూపతనమైనది మొదలుగ నేటివరకు పొందెడుమనోవ్యధలు కొంతకాలమును సంఘటించునా ? ఇంకముం దెన్నివిపత్తులుగలవో కదా. ఈదుర్దశను తలచినప్పుడెల్ల గుండె ఝల్లుమనుచున్నది. కనుక నన్ను పాపవిమోచనునిజేసి కాపాడుము.

మ. పరిశీలించితిమంత్రతంత్రములు చెప్పన్వింటిసాంఖ్యాదియో
గరహస్యంబులు వేదశాస్త్రములు వక్కాణించితిన్ శంకవో
దరయం గుమ్మడికాయలోను యవగింజంతైన నమ్మించి సు
స్థిర విజ్ఞానము త్రోవఁజెప్పఁగదవే శ్రీ... 77

తా. అంధకాంతకా ! బాల్యమునుండియు మిగుల ప్రయాసతో తర్కవ్యాకరణాదిశాస్త్రములను వేదమును జదివియుంటిని కాని నాయనుభవముచేత నలుకంతయు సంశయము నాకువిడలేదనియు, నింతవరకు నిన్ను మెప్పింపజాలినభక్తి నాకలవడలేదనియు విన్నవింపవలసియున్నది. కావున సంశయరాహిత్యమునొందించి నన్నురక్షింపుము.

మ. మొదలం జేసినవారిధర్మములు నిర్మూలంబుగాఁ జేసి దు
ర్మదులై యివ్వసు వారిధర్మములోనర్పం దమ్ముదై వంబు న
వ్వదె తా నున్నదురాత్ములెల్ల దమత్రోవం బోవరే యేలచే
సెదరో మీఁదు దలంచి చూడ కధముల్ శ్రీ... 78.

తా. పావనమూర్తీ! కలుషాత్ములు తమప్రజ్ఞావిశేషము తాత్కాలికమదోన్మత్తతయుఁజూపిన సజ్జనులను పలుబాములబెట్టి లాభములను బడయఁగోరెదరు. అంతియకాని నీచేవిధింపబడు ఘోరదండనలను దెలియఁజాలరు తుచ్ఛసుఖములు శాశ్వతములుగానిలుచునా ?

శా. కాసంతైనసుఖం బొనర్చునొ మనఃకామంబు లీడేర్చునో
వీసం బైనను వెంట వచ్చునొ జగద్విఖ్యాతి గావించునో
దోసంబు ల్వెడఁబాపునో వలసినం దోడ్తోమిముం జూపునో
ఛీ! సంసారదురాశయే లుడుపవో శ్రీ... 79.

తా. త్రిపురాంతకా! యెండమావులవంటి యీసంసారమునందు పెనగొనిన యాశ లేశమైనను సుఖమిచ్చునా ? తనువులుబాయునపుడు వెంటవచ్చునా ? కీర్తినిచ్చునా ? ముక్తినిచ్చునా? కావున నీయాశను మరలించి నీపదపద్మములందు నిలుపుమని ప్రార్థించెదను.

మ. ఒకఁ పూటించుకకూడు తక్కువగునే నోర్వంగలేఁడెండకో
పక నీడ న్వెదకుం జలిం జడిసి కుంప ట్వెత్తుకోఁజూచు వా
నకు నిండింట్లను దూఱు నీతనువు దీనన్వచ్చుసౌఖ్యంబులో
సి కడాసింపరు గాక మర్త్యు లకటా శ్రీ 80.

తా. నాగకుండలా! ఈపాపిష్టిశరీరము నేమనిచెప్పవచ్చును ? నీత మును గాని యుష్ణమును గాని సహింపలేదుగదా! రోగములచే సదాపీడింప

బడుచున్నదిగదా ! ఇట్టిబాధకరమైనశరీరమును పామరులు కాంక్షతో ఘన మనిచూతురుగాని లేశమైనను వైరాగ్యచిత్తముతో ముక్తిమార్గమును వెదుకబోరు.

శా. కేదారాదిసమస్తతీర్థములు కోర్కెం జూడఁబో నేటికిన్
గాదా ముంగిలి వారణాసి కడుపే కైలాసశైలంబు మీ
పాదధ్యానము సంభవించునపుడే భావింపగాజ్ఞాన ల
క్ష్మీమదాద్రులుగారె లోకు లకటా శ్రీ ... 81.

తా. చండికేశ్వరా ! సమస్తచరాచరంబులనిండియున్న పరంజ్యోతి వినీవై పరిశాశించుచుండగా స్థిరచిత్తములేక మూఢులు బహుతీర్థయాత్రా టనచేయబోదురు, మనస్సు నిలుకడలేనివారికి నీవాతీర్థములయందుమాత్రము ఎట్లుగాన్పింతువు ? గావున పూర్ణమైనవమ్మికతో నిన్నుభజించినయెడల నీవు హృదయమందే ప్రసన్నుడవగుదువని నానిశ్చయము,

మ. తమకంబొప్పఁ బరాంగనాజన పరద్రవ్యంబులన్ ముచ్చిలం
గమహోద్యోగముసేయు నెమ్మనముదొంగంబట్టి వైరాగ్య
పాశములం జుట్టి బిగించి నీదుచరణస్తంభంబునన్ గట్టివై
చి ముదం బెప్పుడుఁ గల్గఁ జేయఁదగవే శ్రీ ... 82.

తా. పాలలోచనా ! పరకాంతపరద్రవ్యముల నపహరించి దుర్వృత్తుల నామనస్సున చోరనీయక దోషరహితునిజేసి నీపదధ్యానమును నాకు నిరంతరమును ప్రసాదింపుము.

శా. వేధం దిట్టఁగ రాదుగాని భువిలో విద్వాంసులం జేయనే
లా ధీచాతురిఁ జేసెఁ జేసినగులా మాపాటనే పోక క్షు
ద్బాధాదుల్ కలిగింపనేల యదికృత్యం బైన దుర్మార్గులం
జీ! ధాత్రీశులఁ జేయనేటి కకటా శ్రీ ... 83.

తా. నిఖిలశరణ్యా! అవివేకియైన బ్రహ్మయొక్క సృష్టి ఎంతవిచార కరమైనది! తొలుత యీజన్మమెత్తించుటయేటికి? ఇట్లు సృజించినవాని సంరక్షణాదులలో లోపమెందుకు కలుగజేసెను. ఇదిక్రమముగాలేదు. కావున నట్టిబ్రహ్మయొక్క తలను ద్రుంచినసమర్థుడవైన జగద్రక్షకా నీవేయీదుర్దశ నుబాపుటకును విధివలన నెన్నటికి నాకుబాధగలుగకుండ శాశ్వతానందము నుగలుగజేయుమని తాత్పర్యము.

మ. పుడమిన్నిన్నొకబిల్వపత్రముననే బూజించిపుణ్యంబులన్
బడయన్నేరకపెక్కుదైవములకున్ బప్పుల్ ప్రసాదంబులుం
గుడుముల్ దోసెలు సారెసత్తులడుకుల్ గుగ్గిళ్లునుంబెట్టుచుం
జెడి యెందుం గొఱగాక పోదురకటా శ్రీ ... 84.

తా. కారుణ్యమూర్తీ! యదార్థమైనసీలముతో నొక్కమారేడుదళ ముచే నిన్నుపూజించిన కేవలము ముక్తికలుగునని వేదము తెలుపుచుండగా నమ్మియుండలేక నానావిగ్రహములకు పూజాదులనియు, పప్పులు ప్రసాద ములనియు మహాగాథలను కల్పించికొని, వివిధాచరణసలుపువారికి నీకటాక్ష ముచేకూరునా?

శా. విత్తజ్ఞానము పాదు నిత్యము భవావేశంబు రక్షాంబువుల్
న్మత్తత్వంబు తదంకురం బనృతముల్ మాఱాకులత్యంతదు
ర్వృత్తుల్ పువ్వులుపండ్లుమన్మథముఖావిర్భూతదోషంబులుం
జిత్తాభ్యున్నతనింబభూజమనఘా శ్రీ ... 85.

తా. శివశంకరా! మనస్సనియెడువస్తువు సామాన్యముకాదు. ఇది ఆరుగురుమహాశత్రువులయిన కామక్రోధాదులను జయించి నిర్మలముగ నీపా దధ్యానమునబడియుండినచో మోక్షము సంపాదింపగలదు. అట్లుగాక కేవ లము సంసారవ్యామోహమునను అట్టి విషయాదులను గెలువలేనిచో, మోక్ష

ముసంపాదింప నేరదు. కనుక దుర్వృత్తులను హరింపజేసి నిశ్చలభక్తిని దయ చేయుడు.

శా. నీపైఁ గావ్యముచెప్పుచున్న యతఁడున్నీపద్యముల్ వ్రాసియి
మ్మాపాఠం బొనరింతునన్నయతఁడుం మంజుప్రబంధంబుని
ష్టాపూర్తిం బఠియించుచున్నయతఁడుం సద్బాంధవుల్
గాకచీ, చీపృష్టాగతబాంధవంబు నిజమా శ్రీ ... 86.

తా. ఓపరమేశ్వరా! నీభక్తులతో స్నేహమొనర్చినచో మోక్షము గలుగునుగనుక నాకు నీభక్తులే దగ్గరచుట్టములుగాని సంసారములో బంధుత్వముగల్గిన పినతల్లిమొదలగువారెన్నటికిని బంధువులుకానేరరు.

శా. సంపద్గర్వముఁ బాఱఁదోలి రిపులం జంకించి యాకాంక్షలన్
దంపుల్వెట్టి కళంకము ల్నఱికి భంధక్లేశదోషంబులం
జింపుల్చేసి వయోవిలాసములు సంక్షేపించి భూతంబులం
జెంప ల్వేయక నిన్నుఁగాన నగునా శ్రీ... 87

తా. శ్రీకాళహస్తీశ్వరా! ఎట్టిమానవుడు ధనమునుజూచికొని గర్వించక కామక్రోధలోభమోహమదమాత్సర్యమను అరిషడ్వర్గమునువిడిచి, పాపపుబనులఁజొరక, యేకోరికలులేక, సంభోగేచ్ఛనువిడచి, స్థిరమనస్సుతో నిన్నర్చించునో యట్టివానికి నీవు ప్రత్యక్షమగుదువు. కాం. నూ. ప్రి.

శా. రాజశ్రేణికి దాసులై సిరుల గోరం జేరగా సౌఖ్యమో
యీజన్మంబు తరింపఁ జేయఁగలమి మ్మెప్రొద్దు సేవించు ని
ర్వ్యాజాచారముసౌఖ్యమో తెలియ లేరామానవు ల్పాపరా
జీజాతాతి మదాంధబుద్ధు లగుచున్ శ్రీ... 88.

తా: త్రిపురారీ ! ఇదిమంచి, ఇదిచెడ్డయని గుర్తెరుగని మానవాధములుకొందఱు దుఃఖములకు జోటిచ్చెడు ధనముకొఱకు రాజసేవజేతురు గాని మోక్షమిచ్చెడు నిన్ను బూజింపఁజాలరు.

శా. నిన్నం జూడరొ మొన్నఁజూడరొ జనుల్ నిత్యంబుఁ జావంగ నా,పన్నుల్గన్ననిధాన మయ్యెడి ధనభ్రాంతి న్విసర్జింపలే,కున్నా రెన్నఁడు నిన్నుఁగందు రిఁక మర్త్యుల్ గొల్వరే మోనిను, న్విశ్వంబోవకప్రోవకుండునెడలన్ శ్రీ ... 89.

తా. గౌరీపతీ ! ప్రతిదినమును మృతిజెందెడువారిజూచియుగూడ నీమనుజులు దాముకూడ నట్టివారేయని గ్రహించలేక ధనకాంక్షచే నిన్ను విడచి యితరులను సేవించువారినిజూచి యచ్చెరువొందక నిన్నర్చించలేకుండిరి. ఎందుచేతనో తెలియదు.

శా. వన్నే యేనుఁగుతోలుదుప్పటము బువ్వాకాలకూటంబు చేగిన్నే బ్రహ్మకపాల ముఁగ్ర మగుభోగే కంఠహారంబు మేల్నీ కీలాగున నుంటయుం దెలసియు న్నీపాదపద్మంబు చేర్చె న్నారాయణుఁ డెట్లు మానసముఁ దా శ్రీ ... 90.

తా. లోకేశ్వరా ! నీకు యేనుగుచర్మమును, విషమును, బ్రహ్మరొక్కతలపుఱ్ఱెయును, సర్పమును యిష్టమైనవిగనుకనే వానినిధరించితివి. అంతకంటె విలువగలవస్తువులు నీకక్కఱలేదు. నీవిట్లున్నను సకలైశ్వర్యవంతుడగు విష్ణుమూర్తి నిన్నుబూజించి యధికుడైనాడు. నీవమంగళవస్తువులు ధరించినను నీభక్తులకు సర్వశుభముల నియ్యగలవునుమా !

శా. ద్వారద్వారములందుఁ గంచుకిజనవ్రాతంబు దండంబులన్ దోరంతస్స్థలి బగ్గనం బొడుచుచుం దుర్భాషలాడన్మ ఱిన్

వారిం బ్రార్థన జేసి రాజులకు సేవ ల్సేయఁగాఁ బోరు ల
క్ష్మీగాజ్యంబును గోరి నీపరిజనుల్ శ్రీ ... 91.

తా. సర్వేశ్వరా ! నీసేవకులు డబ్బుకొఱకును, ఉద్యోగముకొఱకును ప్రడమిాళుల నాశ్రయింపక, రాజులసేవకులు పెట్టెడిబాధలకోర్చియుండక నిత్యమును నిన్నేబూజించుచుందురు.

శా. ఊరూరం జనులెల్ల భిక్ష మిడరో యుండం గుహ ల్లవో
చీరానీకము వీధులం దొరకదో శీతామృతస్వచ్ఛవాః
పూరం బేరులఁ బాఱదో తపసులం బ్రోవంగ నీవోపవో
చేరం బోవుదు రేల రాజుల జనుల్ శ్రీ ... 92.

తా. మహేశ్వరా ! ఊరూర బిచ్చమెత్తికొనితిని వీధులందొరకు ప్రాతగుడ్డలుధరించి, కొండబిలములందు కాపురముండి నదులలోని తియ్యని నీరమునుగ్రోలుచు కాలముగడపినమునులను నీవు రక్షించితివిగదా! అటువంటిసమయమున జనులారీతిజేయక తుచ్ఛసుఖమునుగోరి నృపాలురను సేవించెదరు.

మ. దయ జూడుం డని గొంద ఱాడుదురు నిత్యంబు న్నినుంగొ
ల్చుచున్, నియమం బెంతో ఫలంబు నంతెగదా నీ కొల్వ
బిండెంతో యంతియకాకొట్టి, యనం,దురాశపడిబుద్ధి గోర
నేలబ్బుసత్క్రియలన్నిన్ను భజింప కిష్టసుఖముల్ శ్రీ ...

తా. పార్వతీనాథా ! "పిండికొలదినిరొట్టి" యనుసామెతవిధమున భక్తికొలదిని ఫలమిాచ్చుచుందువు. తక్కువసేవజేసి పెద్దకోరికలనుగోరు మనుజుల కవియేవిధముగా చేకూరగలవు. (చేకూరవనిభావము.)

శా. ఆరావం బుదయించెఁ దారకముగా నాత్మాభ్రవీధి న్మహా
కారోంకారమకారయుక్త మగునోంకారాభిధానంబు చె

న్నారు న్విశ్వ మనంగఁ దన్మహిమచే నానాదబిందు ల్సుఖ
శ్రీ రంజిల్లఁగడంగు నీ వదె సుమీ శ్రీ ... 94.

తా. పావనమూర్తీ! అ, ఉ, మ, అనెడు అక్షరములతోఁగూడిన ఓంకారమనెడు ధ్వని బ్రహ్మస్వరూపము గానున్నది. దానిచేతప్రపంచము ప్రకాశించుచున్నది. ఓంకారమును బుద్ధియం దొకటైనయెడల అఖండానందమనెడు సంపద చేకూరును. ఆయానందమే నీవునుమా!

శా. నీభక్తు ల్పదివేలభంగుల నిను న్సేవింపుచుం డేడఁగా
లోభం బేటికి వారికోర్కులు కృపాళుత్వంబుసం దీర్పరా
దాభవ్యంబుఁ దలంచి చూడు పరమార్థం బిచ్చిపొమ్మన్న నీ
శ్రీభాండారములోఁ గొఱంతపడునా శ్రీ ... 95.

తా. లోకారాధ్యా! నీభక్తులు నిన్నసేకరీతుల పూజించినను దయతోవారికోర్కులు దీర్పకుంటివి. నీకెందులకింతలోభము? ఆభక్తుల క్షేమము నాలోచించి వారికి పరమార్థమిచ్చిన నీకేమిలోటువచ్చును?

మ. మొదల న్భక్తులకిచ్చినాఁడవుగదా మోక్షంబు నేఁడేమయా
ముదియంగా ముదియంగఁ బుట్టెఁ ఘనవశామోహంబు లో
భంబు నన్నదిసత్యంబు కృపం దలంప వొకపుణ్యాత్ముండు
నిన్నాత్మఁగొల్చిదినంబున్మోఱపెట్టఁగాఁ గటకటా శ్రీ... 96

తా. ఆపదోద్ధారకా! పూర్వమునీవు అనేకభక్తులకు (మార్కండేయుడు మొదలగువారికి) ముక్తినిచ్చియుంటివి "ముసలితన మెక్కువకాగా మూడుగుణము లెక్కువైనవి" అను సామెతప్రకారము యిప్పుడు నిన్నసేకపుణ్యాత్ములు పూజించినను వారి మొఱ్ఱాలించకుంటివిగదా!

పురాణగాథ:—పూర్వము మార్కండేయుడను బాలకుడొకడు శివునిగూర్చి చిన్నతనమునుండియు పూజసేయుచుండెను. కాని యాతనికి పదు

సారవయేట మరణమువ్రాసియుండెను. యముడట్లు 16 వ సంవత్సరమున మరణదినమునవచ్చి పాశమును వేసి లాగుచుండెను. కాని యాతడు శివలింగమును కౌగిలించుకొని శంకరుని ప్రార్థించుచు రానొల్లడయ్యె, అంతశివుడా తని మొఱ్ఱాలించి తనుమేవచ్చి వానికి పూర్ణాయుర్దాయమిచ్చి యముని బంపివేసెను. అప్పటినుండియు నాబాలకునికి పదునారేండ్లవయస్సేయను నమ్మికగలదు.

శా. కాలద్వారకవాటబంధనము దుష్కాలప్రమాణక్రియా
లీలాజాలకచిత్రగుప్తముఖవల్మీకోగ్రజిహ్వద్భుత
వ్యాళవ్యాళవిరోధి మృత్యుముఖదంష్ట్రాహార్యవజ్రంబు ది
క్చేలాలంకృత నీదునామ మరయన్ శ్రీ ... 97.

తా. చంద్రమౌళీ ! నిన్నుస్మరించువారు యమునిసాన్నిధ్యమునకు బోరు. వారుపుణ్యాత్ములగుదురుగావున చిత్రగుప్తుడు వారిపుణ్యపాపముల వ్రాయనక్కరలేదు. వారికకాలమరణము సంభవించదు.

మ. పదివేలైనను లోకకంటకులచే ప్రాపించు సౌఖ్యంబు నా
మదికిం బథ్యముగాదు సర్వమునకున్ మధ్యస్థుడై సత్యదా
నదయాదుల్గలరాజు నాకొసగు మెన్నన్వాని నీయట్ల చూ
చి దినంబు న్ముద మొందుదుం గడపటన్ శ్రీ ... 98.

తా. భక్తవత్సలా ! జనులనుహింసించురాజాయిచ్చెడు సుఖము గొప్పదైనను(అనగా చాలధనమిచ్చినను) నాకావంతేనియు సంతసముగలుగదు. కనుకలోకమునకు పక్షపాతము లేనివాడై సత్యము,దాన,దయాళుత్వము కల్గినప్రభువును నాకుప్రసాదింపుము.అనగానిన్నే యట్టిరాజుగాభావించిపూజనేసి మోక్షం బొందెదను.

శా. తాతల్ తల్లియుదండ్రియున్ మఱియు బెద్దల్ చావగాజూ
డరో,భీతిం బొందగ నేల చావునకుగా బెండ్లాముబిడ్డల్హిత

ప్రాతంబు న్బలవింప జంతువులకు న్వ్యాలాయ మైయుండఁ
గా, జేతోవీధి నరుండు నిన్ గొలువఁడో శ్రీ ... 99.

తా. దయానిధీ! తాతలును, తల్లిదండ్రులును, యితర పెద్దలును చని పోవుటయు వారియాలుబిడ్డ లేడ్చుటయు తెలిసియుండియు, తానుగూడ నట్లే యెప్పుడో మృత్యువునోట బడుదునని యెఱింగియుండియుగూడ యిహ లోకసుఖములలోనే మునిగియుండును గాని, మానవుడు తనమనస్సునందు నిన్ను ధ్యానింపడు.

శా. జాతు ల్చెప్పుట సేవ సేయుట మృషల్ సంధించు టన్యాయ
విఖ్యాతింబొందుట కొండెఁకాడవుట హింసారంభకుండౌట మి
ధ్యాతాత్పర్యములాడుటన్నియుఁ బరద్రవ్యంబు నాశించి యీ
శ్రీ తా నెన్నియుగంబు లుండఁగలదో శ్రీ ... 100

తా. మృత్యుంజయా! ధనమశాశ్వతమైనది. అట్టి డబ్బుకాశించి మానవుడు పాపములనేకములుజేసి జీవనము చేయుచుండును.

మ. చెడుగుల్ కొందఱు కూడి చేయఁగఁ బనుల్ చీకట్లు దూ
ఱంగఁ బాల్పడితిం గాని చరింపరాని నిను నొల్లం జాలుఁ
బొమ్మంచు ని, ల్వెడలం ద్రోచినఁ జూరువట్టుకొని నేవ్రేలా
డుదుం గోర్కెఁ గో, రెడియర్థంబులు నాకు నేలయిడవో శ్రీ ...

తా. మహేశ్వరా! దుర్మార్గులతోగూడి నేననేక దుష్కార్యములు అనగా జారచోరత్వములు చేసిన మహాత్ముడను. అందువలన నీవు నన్నొక వేళ పరిహరించెదవేమో? అట్లుపరిహరించినను ''ఇంటనుండి వెడలగొట్టగా చూరుపట్టుకువేలాడె'' నన్నసామెతరీతిని నీవు నాయీప్సితార్థము లీడే ర్చువరకు నిన్నుగొలువక విడువను.

మ. భసితోద్ధూళనధూసరాంగులు జటాభారోత్తమాంగుల్
తపో, వ్యసనుల్ సాధితపంచవర్ణరసనుల్ వైరాగ్యవంతుల్
నితాం, తసుఖస్వాంతులు సత్యభాషణసముద్యద్రత్నరుద్రా
క్షురా, జినమేతుల్ తుద నెవ్వరైన నఁ గొలుతున్ శ్రీ...102

తా. పశుపతీ! విభూతిరుద్రాక్షధారులగుటయే గాక నిరంతరము నీయారాధననిరతులై ఏమహానుభావులు చరింతురో అట్టినీభక్తులు నీస్వరూపులనిభావించి వారికి విధేయుడనై యుందును.

మ. జలజశ్రీ గల మంచినీళ్ళు గలవా చట్రాతిల్లో బావు రే
వెలివాడ స్మృతి బావనిల్లు గలదా వేసాలుఁగా నక్కటా
సలినారెండుగుణంబు తెంచి మదిలో నన్నేమిరోయంగ నీ
చెలువంబైనగుణంబు లెంచుకొనవే శ్రీ ... 103.

తా. అర్ధేందుమౌళీ! నాహృదయము పాపగుణభూయిష్ఠమైనను నేను అజ్ఞానాంధకారములోబడి నిన్నుమఱచియుండువేళలను అట్టికళంకములను నిర్మూలించి నన్ను మనుపుము.

మ. గడియల్ రెంటికొమూఁటికో గడియకో కాదేని నేఁడెల్లియో
కడనేఁడాదికొ యెన్నఁడో యెఱుఁగ మీకాయంబు లీభూమి
పైఁ, బడఁగా నున్నవి ధర్మమార్గ మొకటిం బాటింప రీమా
నవుల్, చెముగుల్ నీపదభక్తియుం దెలియరో శ్రీ ...104.

తా. స్వయంభూ! క్షణభంగురమైనశరీరములను గల్గినీయాజ్ఞయైనచో నిముసమైనను పుడమియందు నిలువనేరని యీమానవులు మాయలోబడి నీధ్యానమును మఱచిపోదురు.

మ. క్షితిలో దొడ్డ తురంగసామజము లే చిత్రమ్ము లాందోళికా
తతు లేలెక్క విలాసినీజనసువస్త్రవ్రాతభూషాకలా
పతనూజాదిక మేమిదుర్లభము నీపాదమ్ము లర్చించుచో
జితపంకేరుహపాదపద్మయుగళా శ్రీ ... 105.

తా. కైవల్యాధిపా! నీపాదములను పూజించెడువారికి, మంచిగుఱ్ఱములు, గజములు, సౌందర్యవతులగుస్త్రీలు, పల్లకీలు, విలువగల యాభరణములు, వస్త్రములు, బిడ్డలులభించుటకేమికొదువ.

మ. సలిలమ్ము ల్సులుకప్రమాణ మొకపుష్పమ్ము న్భవన్మౌళి ని
శ్చలభక్తిప్రతిపత్తిచే నరుఁడు పూజ ల్సేయఁగా ధన్యుఁడౌ
నిల గంగానదిఁజంద్రఖండమును దానిందుం దుదిన్ గాంచు
నీ,చెలువంబంతయు నీమహాత్మ్య మిదిగా శ్రీ... 106.

తా. మహాదేవా! చలించనిభక్తితో పుక్కెడునీళ్ళతో నీకభిషేకము జేసినను, యొక్కపువ్వుతో నిన్నుపూజించినను, అట్టివాడు యీలోకమున ధనధాన్యాదులనుబొందును. ఉత్తమలోకమున శివునివలె తలయందు ఆకాశగంగయు, చంద్రకళాశిరోభూషణమును ధరించును. అనగా శివభక్తులు భూలోకమందు ధనధాన్యాదివిరులుగలిగి పుణ్యలోకమున శివునిరూపును బొందగలరు.

మ. తమనేత్రద్యుతిఁ దామె చూడ సుఖమై తాదాత్మ్యము
న్గూర్పఁగా, విమలమ్ములక్కమలాభము ల్జితలసద్విద్యుల్ల తా
లాస్యముల్, సుమనోబాణజయప్రవమ్ము లనుచు న్గూచున్
జనం బూనిహో. రిమ్మగాక్షీనివహమ్ముకన్నుఁగవలఁ శ్రీ...

తా. మౌనివంద్యా! నరులు తమనేత్రములచేత తమ్ముతామే జూచి కొనినయెడల ఆనందమెయుండును. గాని వారట్లుజేయక సౌందర్యవతులగు స్త్రీలకన్నులనుజూచి యాకన్నులు పద్మములవలెను, మెఱుపుతీగలవలెను, మన్మధునికి జయమునిచ్చునవిగాను నున్నవని తలంచెదరు.

మ. పటవద్రజ్జుభుజంగవద్రజతవిభ్రాంతిస్ఫురచ్ఛుక్తివ
ద్ఘటవచ్చంద్రశిలాజపాకుసుమరుక్సాంగత్యవత్తంచువా
క్పటిమల్నేర్తురు చిత్సుఖం బనుభవింపన్ లేక దుర్మేధనుల్
చిటుకన్నం దలపోయఁజూతు రధముల్ శ్రీ... 108

తా. సదాశివా! ఆత్మజ్ఞానములేనినరులు యద్వైతానందము ననుభవింపలేక కాలినవస్త్రమువలెను, తాటిచేఁజుట్టబడిన సర్పమువలెను, వెండి వలెప్రకాశించు ముత్యపుచిప్పవలెను, కుండవలెను, చంద్రకాంతమణికిగల కాంతివలెను మానవశరీరములోకనిముసమునుండి మఱియొకనిముసమున నశించునని యెన్నియో వేదవాక్యములు పలుకుదురుగాని యనుభవించలేరు.

మ. నినునిందించినదక్షుపైఁ దెగవో వాణీనాథు శాసింపవో
చనునా నీపదపద్మసేవకులఁ దుచ్ఛం బాడుదుర్మార్గునిన్
బెనుపన్నీకునునీదుభక్తతతికిన్ భేదంబు గానంగవ
చ్చెనో లేకుండిన నూరకుండఁగలవా శ్రీ... 109

తా. కలుషహరణా! నిన్నుదూషించిన దక్షునిజంపినావు. నీకు ద్రోహము గావించిన బ్రహ్మయొక్కశిరస్సు ఖండించినావు; గాని నీభక్తోత్తరుల దూషించినవారినిమాత్రము నశింపజేయజాలకున్నావు. దీనినిబట్టి చూడ నీకును నీభక్తులకు వ్యత్యాసముగలదని నీయుద్దేశ్యమైయుండును: లేనిచో నీవూరకుందువా?

పురాణగాధ:—దక్షప్రజాపతికి సతీదేవియను నొకకొమరితగలదు. అతడామెను శివునికిచ్చి వివాహముజేసెను. కొన్నాళ్ళుపోయినతరువాత దక్షుడు యజ్ఞముచేయఁదలంచి తనయల్లునిపిలుచుటకై వెళ్ళగా శివుడు సమాధిలోనుండుటచేత తనమామను గౌరవింపలేదు. అంతదక్షుడు మిగుల కోపోద్దీపితుడై తనకుమార్తెవద్దకుజని శివు ననేకవిధములనిందించి తనగృహంబునకు జని యజ్ఞముచేయ నారంభించెను. అంతసతీదేవి యజ్ఞమునకుపోవుట కనుజ్ఞ యిమ్మన శివుడు వలదని వారించెను. ఆమెవినక తండ్రియొద్దకు యజ్ఞమును జూచుటకై పోగా తండ్రి యామెను సభలో నిర్లక్ష్యముగాజూచెను. అట్టి నిర్లక్ష్యమును జూచి యామె మిగుల కోపముగలిగి తనపతివ్రతామహిమవలన యోగాగ్నిని గల్పించుకొని భస్మమాయెను. సాంబశివునిమాతలీ వృత్తాంతమును అతనికి నివేదింపగా, యాశంకరుడు వీరభద్రావతారమెత్తి దక్షుని సంహరించెను. (కాం. మా. ప్ర.)

ఈశ్వరుడు బ్రహ్మశిరస్సును ఖండించుటకు కారణము:—ఈశ్వరుడుసతీదేవిని వివాహమాడినట్లు పైనివ్రాయబడియున్నది. ఆసతీదేవిని వివాహసమయములోజూచిన బ్రహ్మయామె సౌందర్యమునకుమెచ్చి యామెను మోహించెను. శివుడదిగనిపెట్టి తనహస్తముతో నొకదెబ్బగొట్టెను. అంత బ్రహ్మకుగల యైదుతలలలో నొకతల యూడిపోయినది. గావున బ్రహ్మ యిప్పుడు చతుర్ముఖబ్రహ్మయైనాడు.

మ. కరిదైత్యు న్బొరిగొన్న శూలము కరగ్రస్తంబుగాదో రతీ
శ్వరుని న్గాల్చినఫాలలోచనశిఖావర్గంబు చల్లారెనో
పరనిందాపరుల న్వధింప విదియున్ భావ్యంబె వా రేమిచే
సిరి నీకు న్బరమోపకార మరయన్ శ్రీ ... 110

తా. శూలపాణీ ! ఇతరులను వ్యర్థముగా నిందించువారిని నీవు శిక్షింపకుపేక్ష జేయుటజూడగా, యట్టిదుర్మార్గులను సంహరించుటకు తగినయాయుధములు మొదలగుసామానులు నీవద్దలేనందుననో యనియు లేక నీవు వారలయొద్ద లంచమును రాబట్టి యూరకున్నావో యనియు తోచుచున్నది.

పురాణగాధ:—రతీదేవి భర్తయగు మన్మధు నీశ్వరు సంహరించిన కారణము 74 వ పద్యముయొక్క తాత్పర్యముచివర జెప్పియుంటిని.

మ. దురము న్దుర్గము రాయబాగము మఱిక్ దొంగర్కము
నైవైద్యమున్, నరనాథాశ్రిమ మోడబేరమును బెన్మంత్రం
బు సిద్ధించినన్, అరయక్ దొడ్డఫలంబు గల్గు నదిగా కాకా
ర్యమేతప్పినన్, సిరియుంబోవును బ్రాణహానియునగున్ శ్రీ...

తా. వృషభవాహనా ! దొంగతనము, వైద్యము, రాజావలంబనము ఓడలవర్తకము, గొప్పమంత్రము మొదలగునవి నిర్విఘ్నముగా నెఱవేరిన మంచిలాభమే కాని తప్పిపోయినయెడల పూర్వమున్నసిరి నశించుటయు ప్రాణహానియుగూడ సిద్ధింపగలవు.

మ. తనయుం గాంచి ధనంబు వాడి దివిజస్థానంబు గట్టించి వి
ప్రున కుద్వాహముజేసి సత్కృతికిఁబాత్రుండై తటాకంబునే
ర్పునఁ ద్రవ్వించి వనంబువెట్టి మనసీ పోలేఁడు నీసేవజే
సినపుణ్యాత్ముఁడు పోవులోకమునకున్ శ్రీ... 112

తా. పరమేశ్వరా ! మానవుడు చెఱువులు త్రవ్వించుట మొదలగు పుణ్యకార్యము లెన్నియో జేసినను నిత్యము నీసేవసల్పెడు భక్తులవలె పుణ్యలోకమునకు బోనేరడు. K. S. P.

మ. క్షితినాథోత్తమసత్కవీశ్వరుఁడు వచ్చెక్ మిమ్ములంజూడఁగా
నతఁ డేమేటి కవిత్వవైఖరిని సద్యఃకావ్యనిర్మాత తత్పత్రి

భల్మంచివి తిట్టుపద్యములు చెప్పం డాతఁడైనక మముం
గ్రితమేచూచెను బొమ్మటందు రధముల్ శ్రీ... 113

తా. ఆపద్బాంధవా! నాకరు రాజసముఖమునకేగి "అయ్యా తమ దర్శనార్థమై యెవరో యొకగొప్పకవి వేచియున్నాడ'ని జెప్పిన యాతడిది పరలోనే మమ్మజూచి వెళ్లెను గావున పొమ్మని చెప్పమనును,

శా. నీకుంగాని కవిత్వ మెవ్వరికి నేనీనంచు మీఁదెత్తితిన్
జేకొంటిం బిరుదంబు కంకణము ముంజేఁగట్టితిం బట్టితిన్
లోకుల్ మెచ్చ వ్రతంబునాతనవ్రకీలుర నేర్పులుంగావు చీ
చీ కాలంబురీతి దప్పెడుఁ జుమీ శ్రీ... 114

తా. గౌరీమనోహరా! నాకవిత్వము నీకేగాని రాజులకు సమర్పించనని యొకశపథమును బట్టితిని, నాశపథమునకు భంగము రాకుండ గాపాడుము.

శా. నిచ్చల్ నిన్ను భజించి చిన్మయ మహానిర్వాణపీఠంబుఁ బ్ర
రచ్చల్సేయక యూర్జవంబు కుజనవ్రాతంబుచేఁ గ్రాగి భూ
భృచ్చండాలురఁగొల్చివారు దనుఁగోపింపంబుధుండార్తుఁడై
చిచ్చారం జము రెల్లఁ జల్లుకొనునో శ్రీ... 115

తా. దైత్యసంహారా! మిగుల గొప్పపండితుడుసహితము చలించనిభక్తిగలిగి నిన్నుపూజించలేక తనకుగల సంసారబాధలు బాపుకొనుటకై భూమీశులను సేవించుచు వారుబెట్టెడి కష్టములయొక్క బాధలుపడుచుండును.

శా. దంతంబు ల్పడనప్పుడే తనువునం దారూఢియున్నప్పుడే
కాంతాసంఘము రోయనప్పుడె జరాక్రాంతంబు గానప్పుడే

వింత ల్మైనజరించునప్పుడె కుఱు ల్వెల్వెల్ల గానప్పుడే
చింతింప న్వలెనీపదాంబుజములన్ శ్రీకాళహస్తీశ్వరా. 116

తా. శ్రీకాళహస్తీశ్వరా! వయస్సుహెచ్చి క్రమముగా ముసలితనమువచ్చి పండ్లూడిపోవును. ఆముసలితనమునందు యౌవనవతులగుస్త్రీలు మానవునిజూచి యసహ్యపడుదురు. ముసలితనమునందు మనస్సు నిశ్చలముగా నుండనేరదు. గావున యివన్నియు రాకుండగనే అనగా శరీరములో బలముండి రోపగలిగియున్నప్పుడే నిన్నుప్రార్థించుటమంచిది.

శ్రీ కాళహస్తీశ్వరశతకము



# కర్రా అప్పయ్యఅండ్ సన్సు రాజమండ్రి



| | | | |
|---|---|---|---|
| నలోపాఖ్యానము-టీకాతాత్పర్యవ్యాకరణముసహా | 0 | 8 | 0 |
| సప్తమస్కంధము డిటో | 0 | 8 | 0 |
| రుక్మిణీకళ్యాణము ,, | 0 | 4 | 0 |
| గజేంద్రమోక్షము ,, | 0 | 4 | 0 |
| భాస్కరశతకము ,, | 0 | 4 | 0 |
| దాశరథీశతకము ,, | 0 | 4 | 0 |
| మానసబోధశతకము ,, | 0 | 4 | 0 |
| కుమారీశతకము ,, | 0 | 3 | 0 |
| సుమతీశతకము ,, | 0 | 3 | 0 |
| టీకా బాలరామాయణము ,, | 0 | 3 | 0 |
| శ్రీ కాళహస్తీశ్వరశతకం తాత్పర్యం | 0 | 6 | 0 |
| నరసింహాశతకము | 0 | 6 | 0 |
| కలువాయిశతకము | 0 | 4 | 0 |
| కోటిలింగశతకము | 0 | 3 | 9 |
| లోకపావనశతకము | 0 | 2 | 0 |
| దేవకీనందనశతకము | 0 | 2 | 0 |
| నందనందనశతకము | 0 | 2 | 0 |
| కుమారీశతకము | 0 | 2 | 0 |
| కవిచౌడప్పశతకము | 0 | 2 | 0 |
| భద్రాద్రిరామశతకము | 0 | 2 | 0 |
| ప్రసన్నరాఘవశతకము | 0 | 2 | 0 |
| శతకములప్రథమసంపుటం20,శతకములుగ్లేజుబైండు | 2 | 8 | 0 |

